





# గంగా వివాహము-
# చెంచితకథ.



వెల ౮ అణాలు.

# ప్రకటన.

పురాతన కవులవల్లను ఈకాలపు కవులవల్లను తేట తెనుఁగున రచియింపఁబడిన కథలు, పదములు, పాటలు, హాస్యములు, మున్నగు సర్వజనోపయోగములగు గ్రంథములను ముద్రించి కొద్దివెలలు ఏర్పఱచి విక్రయించుటకై మయూరమండలియను గ్రంథమాల నూతనముగా స్థాపింపఁబడినది. తెలుంగు బాస మాట్లాడే రెండు కోట్ల ముప్పదిలక్షల 2,30,00,000 మంది జనులలో భారతాది గ్రంథములను చదివి అర్థము గ్రహించుకోఁగలవారు ఇరువది వేల 20,000 మందియైనను ఉండరు- అనగా వేయిమందిలో ఒక్కఁ డుండఁడు! మయూర మండలిలో ప్రచురింపఁబడు గ్రంథములు తెలుంగుభాష చదువనేర్చినవారిలో నూటికి తొంబదిమంది అర్థము గ్రహింపఁదగినవిగా నుండుటయేగాక స్త్రీ పురుషులు, బాలురు బాలికలు-అందరికీ మిగుల మనోహరములుగానుండును. సంవత్సరమునకు రెండు మూడు గ్రంథములు ప్రచురింపఁబడి శాశ్వతచందాదార్లకు పోస్టు

# గంగావివాహము - సూచిక.

---

మయూరమండలి - రెండవగ్రంథము
జూలై నెలాఖరున ప్రచురింపఁబడును!
☛ వెంటనే చందాదార్లుగా చేరండి!!

---

# కమలామణి లేఖలు.

చందాదార్లకు వెల **12** అణాలు. ఇతరులకు **1** రూ.

---

ఉద్యోగకారణమున విదేశగతుఁడైన భర్తకు కమలామణి వ్రాసిన యీ లేఖలు వట్టి వలపుజాబులు గాక ప్రేమామృతముతో నిండి లోకాచార వ్యవహారముల విచిత్రవర్ణనము గలిగియుండుటచే స్త్రీ పురుషుల కెల్ల పఠనీయములు. ఆ1902 సం॥ జూనుమాసములో నివి యాంగ్లేయభాషలో ప్రచురింపఁబడి ప్రపంచమెల్లెడల వ్యాపించియున్నవి. చక్రవర్తి మొదలుగ లక్షలకొలఁది జనులు చదివి శ్లాఘించియున్నారు. లేఖారూపకమయ్యు చదువఁజదువ కట్టుకథగాఁ గన్పట్టి, తుట్టతుదకు కమలామణికి సంప్రాప్తమగు దుర్గతి అత్యంతవ్యసనకరముగా నుండును.

---

విక్టోరియా డిపో - మైలాపూరు - మద్రాసు.



శ్రీరస్తు.

# గంగావివాహము.

హరిహరీ నారాయ ♦ ణాదినారాయణా।
కరుణించి మమ్మేలు ♦ కమలలోచనుఁడా॥

శ్రీరామ రఘురామ ♦ శ్రీమహాగుణధామ
శత్రుకోటివిరామ ♦ జగదభిరామ।
లోకపాలన రామ ♦ లోకనాయక రామ
చారుతారకనామ ♦ సంగ్రామభీమ।
దండంబు దండంబు ♦ దాసమానసలోల
వందనము వందనము ♦ వరపుణ్యాశీల।
జోహారు జోహారు ♦ సురకోటిసంరక్ష
శరణార్థి శరణార్థి ♦ జయ జగద్రక్ష।
పరఁగు పిపీలికా ♦ బ్రహ్మాపర్యంతంబు
నీవెగా వెలుఁగుదువు ♦ నిఖిలలోకేశ।
వేదవేదాంతములు ♦ వెదకిచూచినఁగాని
నీచరిత్రలుగదా ♦ నిగమసంచార।

ఎంతచదివినఁగాని ♦ యెంత తెలిసినఁగాని
నిన్నుఁజెందకరాదు ♦ నిర్వాణపదవి।
నీనామమేకదా ♦ నిఖిలజీవులకెల్ల
మోక్షదాయకమైన ♦ మూలమార్గంబు।
మొదలుతుది గానకను ♦ మూర్ఖాత్ములై నరులు
పరదైవముల వేఁడి ♦ భ్రమలుచెందేరు।
కరిరాజు మకరిచేఁ ♦ గష్టించువేళలను
నీవెగా రక్షించి ♦ నావు మాతండ్రి।
కురురాజు పాంచాలి ♦ కొప్పుపట్టీడ్వంగ
నీవెగా రక్షించి ♦ నావు లోకేశ।
సురలు దానవులచే ♦ వెఱపందు వేళలను
నీవెగా ప్రోచితివి ♦ దేవాదిదేవ।
కావుకావుమటన్న ♦ కాకాసురుని తప్పు
నీవుగా మన్నించి ♦ నావు దేవేశ।
ఏవేల్పులకు చేయి ♦ యెత్తిమ్రొక్కినఁగాని
అర్పితము నీకెగా ♦ ఆదిదేవేశ।
నేరకుంటేనేమి ♦ నేర్చియుంటేనేమి
నీచరిత్రము లెవ ♦ ్వర్ణింపగావలెను।
ఇలలోనఁనరజన్మ ♦ మెత్తినందుకు నిన్ను
భజనసేయనివాని ♦ బ్రతుకేమిబ్రతుకు।

దేవాదిదేవుఁడవు ♦ దివ్యస్వరూపుఁడవు ।
భువనముల కన్నిటికి ♦ పూజనీయుఁడవు ।
సోమకుని పరిమార్చి ♦ శ్రుతులుద్ధరించితివి
మత్స్యావతారమున ♦ మహానీయ నీవు ।
అమరాసురులుకూడి ♦ యబ్ధిఁదరచిననాఁడు ।
గిరికిందకూర్మమయి ♦ పరఁగితివి స్వామి ।
చాపచుట్టగనున్న ♦ జగముద్ధరించితివి ।
వరహావతారమున ♦ వనజాక్ష నీవు ।
స్తంభమున నుదయించి ♦ కనకకశిపునిఁ జంపి
యుగ్రనరసింహమయి ♦ యొప్పితివి స్వామి ।
అవనిమూఁడడుగు లి ♦ మ్మనుచుబలినడిగితివి
నీవెమానవుఁడవై ♦ నావు మాతండ్రి ।
ఇరువదియొకమారు భూ ♦ వరుల ఖండించితివి
నీవెగద పరశురా ♦ మావతారమున ।
దశరథుని సుతుఁడవై ♦ దశకంఠుఁజంపితివి
రాజ్యమున జగదభి ♦ రాముఁడవు నీవు ।
కూర్మితో గోపకుల ♦ గూడిచరియించితివి
దివ్యముగ బలరామ ♦ దేవుఁడవునీవు ।
మాయధర్మముచేత ♦ మహినివిలసిల్లితివి
భువనముల రక్షింప ♦ బుద్ధావతార ।

ఖలులఁబరిమార్చుటకు ♦ కలికావతారమున
నీవెగా వెలసితివి ♦ నిఖిలలోకేశ ।
బహుజన్మకృతపాప ♦ పరిహారమయిన నీ
తనువునంటనియట్టి ♦ తనువేమితనువు ।
కరము వేడుకతోడ ♦ నిరతంబు నీకథా
శ్రవణమ్ము లేనట్టి ♦ చెవులేమి చెవులు ।
నీపదంబుల దృష్టి ♦ నిల్పి వేడుకతోడ
నినుఁజూడలేనట్టి ♦ కనులేమికనులు ।
చిత్తమొక్కటిచేసి ♦ శ్రీహరీయని నిన్ను
కోరిపిలువనివాని ♦ నోరేమి నోరు ।
నిండు వేడుకతోడ ♦ నీపదంబులయందు
మనసునిల్పనియట్టి ♦ మనసేమి మనసు।
తుచ్ఛుఁడైతేనేమి ♦ దొడ్డప్రభువైతేమి
నిక్కొక్కటేకదా ♦ లోకలోకేశ ।
శక్తియెంతైతేమి ♦ సరస కవిత్వంబు
నీకొక్కటేకదా ♦ లోకలోకేశ ।
పద్యములుగూర్చినిను ♦ పండితులు పొగడేరు
పదములనుగూర్చినే ♦ ప్రార్థింతుస్వామి ।
జగతిలో పల నర ♦ స్తవము సేయక నేను
నీకంకితము సేతు ♦ నాకవిత్వంబు ।

సారంగధరచరిత ♦ శతకంఠయుద్ధంబు
పరఁగనీకృతిచేసి ♦ పాటపాడితిని ।
కడుభక్తితోనిపుడు ♦ గంగావివాహంబు
పదములుగాఁగూర్చి ♦ పాటపాడెదను ।
స్కంధపురాణమున ♦ గంగావివాహంబు
పుడమినాయకకవి ♦ పూర్వముఁజెప్పె ।
ఆకథాశృంగార ♦ మంతచేర్చితినేను
నిఖిలలోకాధార ♦ నీదయనుబట్టి ।
నానోటిపలుకులా ♦ నందంబుగాఁజేసి
పుడమిజనులకుఁబ్రీతి ♦ పుట్టించుస్వామీ ।
జయదేవజయదేవ ♦ సకలలోకాధార
ఆలింపు మాలింపు ♦ మాదరంబుగను ।
శ్రీవెలయ ధరణిలో ♦ సిరి గులుకుచున్నట్టి
శృంగార మొప్పు క ♦ ళింగరాజ్యంబు ।
అమరంగ నేఁబది ♦ యారు దేశంబులకు
శృంగార మొప్పు క ♦ ళింగరాజ్యంబు ।
పాటిమీఱు కళింగ ♦ పాదుపానామమున
మహితకీర్తిఁజెలంగు ♦ మన్యసుల్తాను ।
వాసిష్ఠగోత్రమున ♦ వర్ధిల్లుమహారాజు
సూర్యవంశపురాజు ♦ సుగుణాఢ్యుఁడతఁడు ।

కందర్పశతకోటి ♦ సుందరాకారుండు
మేటయిన రత్నకి ♦ రీటమాంధాత।
ఛప్పన్న దేశాల ♦ జననాయకులకెల్ల
పేరు మీఱినయట్టి ♦ బిరుదాంకితుండు।
మండలాధీశ్వరుఁడు ♦ మార్తాండ తేజుండు
పరఁగువిజయపురీంద్ర ♦ పరిపాలకుండు।
రాజాధిరాజు నా ♦ రాయణాంశుండునవ
రత్నగద్దియపైన ♦ రంజిల్లుప్రభువు।
భాసిల్లుశ్రీపూస ♦ పాటివంశాంభోధి
రాకావిహారతా ♦ రకబాంధవుండు।
రాణించుశ్రీవిజయ ♦ రాజగజపతిమహా
రామచంద్రుండేలు ♦ రాజ్యంబులోని।
పరగణాలనుదేవు ♦ పల్లెతాలూకులో
దఱిఁజేరి చెలువొందు ♦ మరువాడపురము।
పాడిపంటలునిత్య ♦ భాగ్యంబులును గలిగి
దానధర్మములచేఁ ♦ దనరారుచుండు।
ఆపురంబునఁగలం ♦ డధికసంపన్నుండు
కౌమరారు మార్కండ ♦ గోత్రోద్భవుండు।
పద్మసాలెకులుండు ♦ పసగాను ముసలయ్య
అతనిభామినిపేరు ♦ అచ్చెమ్మవెలఁది।

ఆదంపతుల తనయుఁ ♦ డగు నాదునామంబు
సన్యాసియనఁబరఁగు ♦ జగతిపై నెల్ల।
సకలవేల్పులఁ మ్రొక్కి ♦ సన్యాసియనువాఁడ
వేడ్కగాపాట ♦ గావింపఁబూనితిని।
కడుచల్లదనమయిన ♦ గంగావివాహంబు
కథ విన్నవారలకుఁ ♦ గలుగుభాగ్యములు।
ఈ కథాశృంగార ♦ మెచ్చోటఁబాడినను
నెల మూఁడు వర్షములు ♦ నిండాఱఁగలుగు।
చదివినను వ్రాసినను ♦ శ్రద్ధతో డుతె విన్న
కలుగుభాగ్యంబులు ♦ కడకు మోక్షంబు।
మరువాడపురమందు ♦ మహిమతో విలసిల్లు
ఈకథాశృంగార ♦ మేవిధంబనిన।
శ్రీగంగపరిణయము ♦ చెలువుగావివరింతు
వినరయ్య సభికులు ♦ వేడుకలుమీఱ।

కథాప్రారంభము

ద్వాపరయుగమందు ♦ ధర్మంబు తప్పకను
పంచపాండవులుసం ♦ పత్కాముఁగుచు।
హస్తినాపుర్యాది ♦ యైనట్టిభవ్యున్న
రాజ్యాధిరాజులై ♦ రంజిల్లుచుండ।

ఒకనాఁడు భీష్ముఁడ ♦ త్యుత్సాహమునమనుమ
లనుజూడఁగోరితాఁ ♦ జనియెదయమీఱ ।
తాతకెదురుగ నడచి ♦ తగ పంచపాండవులు
పాదపద్మంబులకు ♦ ప్రణమిల్లిరపుడు ।
ప్రణమిల్లియున్నట్టి ♦ మనుమలను వేగముగ
అక్కునను జేర్చుకొని ♦ అతఁడాదరించె ।
ఆదరించినతాత ♦ నపుడుదోడ్కొనిపోయి
గద్దెపయి కూర్చుండఁ ♦ గాఁబెట్టిరంత ।
గద్దెపయికూర్చుండఁ ♦ గాఁబెట్టి బంతిగా
పదసేవచేసిరి ♦ పంచపాండవులు ।
పదసేవచేయుచును ♦ భక్తి జొత్తిల్లంగ
అతనితోడుత నిట్టు ♦ లనియెనర్జునుఁడు ।
తాతగాంగేయ మీ ♦ తల్లి గంగాదేవి
లోకపావని సర్వ ♦ లోకాలజనని ।
జీవకోటులకెల్ల ♦ జీవనంబై పరఁగు
కల్మషంబులులేని ♦ గంగాభవాని ।
కరివేల్పు పదములం ♦ దరయఁబుట్టినకొమ్మ
కరివేల్పునిల్లాలు ♦ కన్నట్టిపట్టి ।
శ్రీకరముగానొప్పె ♦ శ్రీగగనవాహిని
కల్మషంబులులేని ♦ గంగాభవాని ।

అఖిలపావనియైన ♦ యాతల్లి కేలాగు
జాలరికులమందు ♦ జన్మంబుగలిగె।
జాలరికులమందు ♦ జన్మంబు తెఱఁగెల్ల
వినియెదను చెవులార - వినుపించవయ్య।
అనియర్జునుఁడుపలుక ♦ నతిదయారసమునను
వినుమనుచు భీష్ముండు ♦ వినుపింపఁ దొడఁగె।

---

ఈశ్వరుఁడు గంగాదేవికి శాపంబొసంగుట.

బ్రహ్మకల్పాంతమున ♦ పదునాల్గు లోకంబు
లణఁగిపోవుటచూచి ♦ యాగంగమాంబ।
తనకడ్డులేరనుచు ♦ తగిలియుప్పొంగుచును
నిండిపొర్లుచుపాఱె ♦ నిఖిలలోకముల।
పర్వతంబులును భూ ♦ భాగమంతయుఁగప్పి
చదలుముట్టినగంగ ♦ జలదరింపునను।
తనసాటియెవ్వరును ♦ ధరణిలోలేరనుచు
ఉప్పొంగునాగంగ ♦ యుప్పరముపొడుగు।
మఱిగర్వమున తన ♦ మహిమచాటుచు గంగ
తుంపరలు చెదరంగ ♦ దుముకుచుం డెనుగా।
వానకురిసినరీతి ♦ వడితుంపరల్ చెదరి
పడియె రజతాద్రిపయి ♦ బహువిధంబులను।

అఖిలపావనియైన ♦ యాతల్లి కేలాగు
జాలరికులమందు ♦ జన్మంబుగలిగె।
జాలరికులమందు ♦ జన్మంబు తెఱఁగెల్ల
వినియెదను చెవులార - వినుపించవయ్య।
అనియర్జునుఁడుపలుక ♦ నతిదయారసమునను
వినుమనుచు భీష్ముండు ♦ వినుపింపఁదొడఁగె।

---

ఈశ్వరుఁడు గంగాదేవికి శాపంబొసంగుట.

బ్రహ్మకల్పాంతమున ♦ పదునాల్గు లోకంబు
లణఁగిపోవుటచూచి ♦ యాగంగమాంబ।
తనకడ్డులేరనుచు ♦ తగిలియుప్పొంగుచును
నిండిపొర్లుచుపాఱె ♦ నిఖిలలోకముల।
పర్వతంబులును భూ ♦ భాగమంతయుఁగప్పి
చదలుముట్టినగంగ ♦ జలదరింపుమను।
తనసాటియెవ్వరును ♦ ధరణిలో లేరనుచు
ఉప్పొంగునాగంగ ♦ యుప్పరముపొడుగు।
మఱిగర్వమున తన ♦ మహిమచాటుచు గంగ
తుంపరలు చెదరంగ ♦ దుముకుచుండెనుగా।
వానకురిసినరీతి ♦ వడితుంపరల్ చెదరి
పడియె రజతాద్రిపయి ♦ బహువిధంబులను।

నేరమేమియు లేక ♦ నిష్కారణముగ నను
హీనకులమున జన్మ ♦ మెత్తుమంటివిగా।
నిర్నిమిత్తంబుగా ♦ నీచజన్మంబునను
పుట్టుమనుటకు నోరు ♦ ఎట్టులాడినది।
అనుచు గద్గదకంఠ ♦ యై రోదనము సేయ
కడు దయాహృదయుఁడై ♦ గౌరీశుఁడనియె।
పరమపావని నీవు ♦ హరికుమార్తైనటంచు
ఉప్పొంగితివిగాదె ♦ ఉప్పరము పొడవు।
ఆఁడుదానికినింత ♦ అతిశయముగూడదని
కోపమున నీకునే ♦ శాపమిచ్చితిని।
శాపమిచ్చినవిధము ♦ చెందకుండఁగఁబోదు
మగువరో నీవిఁకను ♦ వగవ పని లేదు।
నీచజన్మంబనుచు ♦ నీవు చింతింపకుము
పణతిరో నిన్ను నే ♦ పరిణయంబవుదు।
పరిణయంబయి నిన్ను ♦ శిరమందుఁ దాల్చెదను
గౌరి నిన్నొక్కగతి ♦ మఱియేలు కొందు।
నమ్మునమ్ముమటంచు ♦ నాగకంకణధరుఁడు
అభయహస్తంబిచ్చి ♦ యాదరించెనుగా।
తనశంకరుండిట్లు ♦ తనకానతియ్యంగ
ఖేదమంతయుఁబాసి ♦ మోదమునునుండె।

ముత్తోవద్రిమ్మరి ♦ పుట్టినజాలరి
పురము వర్ణన సేతు ♦ పొలుపుమీఱఁగను।

---

ఏలాపుర వర్ణనము.

భువనైకసుందరము ♦ పూర్ణలక్ష్మీకరము
హెచ్చుశోభస్కరము ♦ ఏలూరిపురము।
వసుమతీస్థలికెల్ల ♦ వన్నె దెచ్చినపురము
ఎల్లెడల వైభవము ♦ ఏలూరిపురము।
పాడిపంటలునిత్య ♦ భాగ్యంబులును గలిగి
దనధాన్యములుగలిగి ♦ దనరినపురము।
గగనంబుపొడుగునను ♦ ఘనతమీఱుచునున్న
నేటయినబంగారు ♦ కోటలునుగలవు।
మేలయినబంగారు ♦ మేడమిద్దెలు గలవు
కెంపులద్వారములు ♦ వింపుగాగలవు।
పవడంపుస్తంభములు ♦ పచ్చతోరణములు
నేటయిన వజ్రక ♦ వాటములు గలవు।
సౌవర్ణమయమయిన ♦ సోపానములుగలవు
విమలచారిత్రములు ♦ వేదికలుగలవు।
చౌషష్ఠవిద్యలును ♦ చదివిచెప్పఁగఁజాలు
ధరణిదేవతలు నా ♦ పురమందుఁగలరు।

భీమపరాక్రమో ♦ ద్దాములయివర్తిల్లు
క్షత్రియోత్తములును ♦ చాలఁగాఁగలరు।
అలకుబేరునితోటి ♦ తులదూగుచున్నట్టి
వైశ్యకోటులుగలరు ♦ వాసిమీఱఁగను।
నవధాన్యరాసులను ♦ వివరముగపండించి
శోభిల్లుచున్నట్టి ♦ శూద్రులును గలరు।
నవమన్మథునికంటె ♦ నాణెముగ గనుపట్టు
పురుషవర్గంబులా ♦ పురమందుఁగలరు।
రంభయూర్వసి మొదలు ♦ రమణులకు సరియైన
వేశ్యకాంతలు గలరు ♦ వేనవేలుగను।
బలుభద్రగజములు ♦ బాగైనరథములు
అశ్వసముదాయంబు ♦ లాయూరఁగలవు।
పదునాల్గులోకములు ♦ వెదకిచూచినగాని
ఆపురముతోసాటి ♦ యేపురములేదు।

శంకుదేవ చక్రమాంబా వృత్తాంతము.

---

ఆపురంబున గలం ♦ డధికసంపన్నుండు
జాలరికులజుండు ♦ శంకుదేవయ్య।
హరిపాదచింతనుఁడు ♦ ఐశ్వర్యకాముండు
పరమార్థవేదుండు ♦ పాపదూరుండు।

వాసిమీఱినసత్య ♦ వాక్యధురంధరుఁడు
బీదకోటులపట్ల ♦ పేరయినవాఁడు।
పుణ్యసముదాయముల ♦ పుట్టినిల్లాతండు
భూలోకమునకెల్ల ♦ పూజనీయుండు।
అతనికి కులభాగ్య ♦ మైనముద్దులగుమ్మ
సైకతశ్రోణియా ♦ చక్రదేవమ్మ।
చెలియచక్కదనంబు ♦ చెప్పశక్యము కాదు
పున్నమచందురుని ♦ బోలు నెమ్మోము।
తరుణినేత్రంబులు ♦ తామరసతుల్యములు
అంగననెన్నుదురు ♦ అర్ధచంద్రుండు।
చెక్కిళ్ళు అద్దములు ♦ శ్రీకారములు చెవులు
సవరైన నాసికము ♦ సంపెంగమొగ్గ।
గళము శంఖము వీపు ♦ కదళికాపత్రంబు
భామినిపాలిండ్లు ♦ బంగారుగిండ్లు।
నళినాక్షినూగారు ♦ నల్లచీమలబారు
వళులుతరఁగలు కౌను ♦ వైఖరి మిన్ను।
కాంతభుజములు లతలు ♦ కటియుపుడమినిబోలు
జలములోపలసుడి ♦ జలజాక్షినాభి।
అరఁటిబోదెలఁబోలి ♦ యతివపెంపొడలుండు
సకియపాదంబులు ♦ సరసీరుహాములు।

ఇంతి చక్కదనంబు ♦ నెంచశక్యముగాదు
పదునాఱువన్నెల ♦ బంగారుతీగె ।
పతినిదైవంబుగా ♦ భావించునేవేళ
వీరపతివ్రత ♦ విఖ్యాతచరిత ।
సంతానమొక్కటే ♦ సతికిలేకున్నయది
కొదువభాగ్యములన్ని ♦ కొనసాగియుండె ।
జాలరికన్నెయని ♦ చాటుటయేకాని
యింతివర్ణనసేయ ♦ నెవ్వరికితరము ।
ఆరీతినుండంగ ♦ నాపేటలోపలికి
వడి మిండజంగంబు ♦ వచ్చినిలిచెనుగా ।
గంటనాడించి శం ♦ కంబూదుకొనుచేఁగి
ప్రతియింటభిక్షంబు ♦ పట్టుచుండెనుగా ।
అర్థిజనులెవ్వరో ♦ యడుగవచ్చెనటంచు
ద్వారంబుకడనిలిచె ♦ తరుణిచక్రమ్మ ।
అంబభిక్షాందేహి ♦ యనిమిండజంగంబు
నెలతకెదురుగవచ్చి ♦ నిలువంబడెనుగా ।
ఇష్టమయినపదార్థ ♦ మేమిటో యిప్పుడే
కోరుమిచ్చెదనంచు ♦ కొమ్మపలికెనుగా ।
చక్రమ్మమాటలకు ♦ సంతోషమునుబొంది
మిండజంగముపలికె ♦ మెలఁతతోనప్పుడు ।

కోరికలు తెల్పుమని ♦ యీరీతి గానన్ను
ఇంతకాలముదాఁక ♦ నెవరడుగరైరి ।
నీవెంతధన్యవో ♦ నీవెంతపుణ్యవో
నీనాధు డెవ్వఁడో ♦ నీనామమేమొ ।
నీపుత్రు లెందరో ♦ నీవెవరిపుత్రివో
చెప్పవేనాతల్లి ♦ చెవులపండువుగా ।
అనియిట్లుజంగంబు ♦ తనతోడఁబలుకంగ
చక్రమ్మపలికె నా ♦ జంగంబుతోడ ।
వినుముజంగమదేవ ♦ తనప్రాణనాధుండు
జాలరికులజుండు ♦ శంకుదేవయ్య ।
తనపేరు చక్రమ్మ ♦ దైవంబు కృపలేక
ఇదివఱకుసంతాన ♦ మియ్యఁడాయెనుగా ।
అనియిట్లుచక్రమ్మ ♦ తనతోడఁబలుకంగ
మిండజంగముపలికె ♦ మెలఁతతోనపుడు ।
క్షితిలోనపుత్రస్య ♦ గతిర్నాస్తియటంచు
వేదములు పలుకంగ ♦ వినవఁటే తల్లీ ।
బిడ్డలేనింటిలో ♦ భిక్షమందఁగరాదు
గతులుదూరంబౌను ♦ కలుషములు పోదవు ।
బిడ్డలు లేనింట ♦ భిక్ష పట్టనటంచు
మాటాడిజంగంబు ♦ మరలిపోయెనుగా ।

ఇంతిరో నాకోర్కె ♦ లీడేర్చవని చాల
మంకుజంగముబిడ్డ ♦ మరలిపోయెనుగా ।
మంకుజంగమువాఁడు ♦ మరలిపోవుటచూచి
చక్రమ్మగుండియలు ♦ ఝులుఝుల్లుమనెను ।
బిడ్డలేనింటిలో ♦ భిక్షు పట్టనటంచు
జంగమదేవర ♦ సాగిపోయెనుగా ।
కలిమేల బలమేల ♦ ఘనవిలాసములేల
బ్రతుకేలసుఖము జీ ♦ వనములవియేల ।
సకలభాగ్యములిచ్చి ♦ సంతోషములనిచ్చి
సంతానమీఁడాయె ♦ సర్వేశ్వరుండు ।
అని చాలచింతించి ♦ యతివ తా చక్రమ్మ
తనప్రాణవల్లభుని ♦ దరిఁజేరిపలికె ।
ప్రాణవల్లభ నేఁడు ♦ బలుమిండజంగంబు
గంటవాయించి శం ♦ ఖంబూదుకొనుచు ।
అంబ భిక్షాందేహి ♦ యనుచు మనవాకిటను
నిలువఁగానంతటను ♦ నేనతనిఁజూచి ।
యేమికావలెనంచు ♦ ఎదురుకొనిరాఁగాను
పలువిధంబులనన్ను ♦ పరికించిచూచి ।
బిడ్డలులేనింట ♦ భిక్షుగైకొననంచు
మసలకను జంగంబు ♦ మళ్ళిపోయెనుగా ।

గోత్రసంసారంబు ♦ గొడ్రాలిబ్రతుకాయె
సంతానపుధనంబు ♦ జాడ లేదాయె ।
ఎన్ని భాగ్యములున్న ♦ నేమి తనయులు లేని
వారలకు సద్గతులు ♦ దూరంబులౌను ।
ఈభోగభాగ్యంబు ♦ లీపదవి మన కేల
గర్భవాసపుపంట ♦ గలదారిచూడు ।
సతిపతులమిద్దరము ♦ సర్వేశ్వరునిగూర్చి
తపమాచరింపంగ ♦ దయవచ్చుతనకు ।
దయవచ్చిమనకు సం ♦ తానభాగ్యంబిచ్చు
కరము దయగలవాఁడు ♦ గౌరీశ్వరుండు ।
మాఱుజెప్పకనాడు ♦ మనవిగైకొనుమంచు
పతిపాదపద్మములఁ ♦ బ్రణమిల్లెనపుడు ।
పాదారవిందములఁ ♦ బ్రణమిల్లియున్నట్టి
సకియనక్కునఁజేర్చె ♦ శంకుదేవయ్య ।

---

**శంకుఁదేవుడు చక్రమాంబాసహితుఁడయి శివునిగూర్చి తపముసేయుట.**

మంచిదేయనియంత ♦ మాఱుమాటాడకను
భక్తితో సతిపతులు ♦ పయనంబులైరి ।
రుద్రాక్షహారములు ♦ రూఢిగానుధరించి
వెలయంగమైనిండ ♦ విభూతిదాల్చి ।

నారచీరలనొక్క ♦ తీరుగాను ధరించి
శంకరునిపై మనను ♦ చక్కగా నిలిపి।
తనబంధువులఁబిలిచి ♦ తనచుట్టములఁబిలిచి
యిల్లువాకిలిసొమ్ము ♦ తెలమిత్రోఁజూపి।
సతిపతులు ఇద్దరును ♦ సారగము ఒక్కనను
ఏకంబుగా తూర్పు ♦ కెదురుగా నిలిచి।
బాహుదండము లెత్తి ♦ భానుమండలముపై
సతిపతులు తమదృష్టి ♦ చక్కగానిలిపి।
చిత్తమొక్కటిచేసి ♦ శివునిపై మదినిల్పి
తప్పకను సతిపతులు ♦ తపముచేసిరిగా।
శంకరుండంతటను ♦ సత్కృపావంతుడై
ప్రమధగణములుతన్ను ♦ భక్తిమైఁగొల్వ।
గాలిమేపరిసూడి ♦ గములుమేనఁజెలంగ
మైనిండనువిభూతి ♦ మహిమమొప్పార।
గళముపుర్రెలపేర్లు ♦ ఘనముగావెలుఁగొంద
వామాంకమునగౌరి ♦ భామచెన్నొంద।
హాలాహలముకంఠ ♦ మందున వెలుఁగంగ
పులితోలుమొలచుట్టు ♦ పొందుగా నమర।
భూతగణములు చుట్టు ♦ ప్రీతితోసేవింప
బ్రహ్మాదులిరువంక ♦ బ్రస్తుతుల్ సేయ।

నాగకంకణధరుఁడు ♦ నాకేశవందితుఁడు
ఐదుముఖములస్వామి ♦ యార్తజనపోషకుఁడు
భళిభళీయనివచ్చి ♦ ప్రత్యక్షమైనిలిచె
భక్తవత్సలుఁడైన ♦ పార్వతీశ్వరుఁడు।
సతిపతులు ఇద్దరును ♦ సాష్టాంగమొనరించి
వినుతిగావించిరి ♦ వేయువిధములను।
శరణు లింగాకార ♦ శరణు పాపవిదూర
శరణు భక్తవిధేయ ♦ శరణు నగధీర।
జోహారుపరమేశ ♦ జోహారు సర్వేశ
జోహారు గౌరీశ ♦ జోహారు ఈశ।
మాతపంబులుపండె ♦ మాకోర్కెలునిండె
నీపాదదర్శనము ♦ నేడు ప్రాప్తించె।
భారతీనాధుండు ♦ ఫణిరాజుమొదలైన
వారలే నీమహిమ ♦ వర్ణించలేరు।
హీనులము మేమనఁగ ♦ నెంతవారము నిన్ను
భజనసేయుటతెలియ ♦ పార్వతీశ్వరుఁడ।
అడుగవచ్చినజంగ ♦ మండఁడాయెనుభిక్షు
గర్భవాసవుపంట ♦ గలుగలేదనుచు।
మాకేమిగతియింకను ♦ మాపాలిదేవుఁడా
సాటివారలఁజూడ ♦ సందేహమాను।

దాతదైవముతల్లి ♦ దండ్రివైనను నీవె
 కరుణించుమిప్పుడే ♦ గతి యొకర్చెదవు ।
కోదువభాగ్యములునీ ♦ కృపనన్నియునుగలవు
 సంతానభాగ్యమే ♦ సమకూర్పవలెను ।
అనుచు సతిపతులిద్దరును ♦ హరుపాదపద్మములఁ
 బడిలేవకుండంగ ♦ పార్వతీవిభుఁడు ।
పదునాల్గులోకములు ♦ పావనముగాఁజేయు
 పరమపావనిగంగ ♦ బాలరూపమున ।
మీకడుపుచల్లన ♦ మీగర్భవాసమున
 జన్మించుటకుగంగ ♦ శపియింపఁబడెను ।
భువనసుందరికన్య ♦ పుట్టనైయున్నది
 వంశమంతటికెల్ల ♦ వన్నెదెచ్చుటకు ।
కోటిసేయఁగఁజాలు ♦ కొమ్మ జననంబౌను
 కొనసాగు మీయింట ♦ కోటిభాగ్యములు ।
ఇఁకమీరుతపమాచ ♦ రింపంగఁబనిలేదు
 పొండిమీమందిరం ♦ బులకు వేడుకను ।
అనిశంకరుండిట్లు ♦ లాదరంబుగఁబలుక
 సతిపతులుపలుగతుల ♦ సన్నుతులుచేసి ।
సెలవుగైకొని ♦ సాటిజాలర్లఁగూడుకొని
 యేలూరిపట్నమున ♦ కేఁగిరవ్వేళ ।

మఱికొన్ని దినములకు ♦ మానవతిచక్రమ్మ
చాలకొన్ని వేడుకను ♦ నెలదప్పియుండె।
చలిసెట్టిగాఱ్ఱులు ♦ అలసటలువాలాయె
తెలిదమ్మివలెమోము ♦ తెల్లనయియుండె।
నడుముపిస్తారమై ♦ నాతి గనుపట్టెను
భామకు నుదరమందు ♦ రోమముల్ మెఱసె।
ఇంతకంతకు నింతి ♦ కరుచిమిక్కుటమాయె
నళినాక్షి చనుమొనల్ ♦ నలుపెక్కియుండె।
మానినీమణికి నవ ♦ మాసముల్ నిండెనని
చెలికత్తెలందఱును ♦ చెంతఁ జేరిరిగా।

చక్రమ్మ గర్భమున గంగాదేవి జనించుట.

---

మంచివారమునాఁడు ♦ మంచినక్షత్రమున
మంచిలగ్నమునందు ♦ మంచియోగమున।
కరికంఠుఁడిచ్చిన ♦ వరమాహాత్మ్యంబున
జాలరిచక్రమ్మ ♦ సంతోషమొదవ।
పరమపావనిగంగ ♦ బాలరూపంబున
జగమెల్ల వెలుఁగొంద ♦ జననమాయెనుగా।
ఆమాటవినఁగనే ♦ ఆశంకుదేవయ్య
మితిలేని తనివిచే ♦ మిన్నందిపడెను।

పుత్రిజన్మించెనని ♦ భూరి తా నిచ్చెను
పదివేలుపదిలక్ష ♦ పాడియావులను ।
చేతికందినకొలఁది ♦ చెలరేగివరహాలు
భూరీలనిచ్చెను ♦ భూసురులకెల్ల ।
హారుఁడిచ్చినట్టితమ ♦ వరముచేకూరెనని
దంపతులుఇద్దరును ♦ తనివినొందిరిగా ।
బాలజన్మించెనని ♦ జాలరిసతులెల్ల
పసుపునూనెలుదెచ్చి ♦ బాలఁజూచిరిగా ।
బాలికారత్నంబు ♦ బంగారుబొమ్మవలె
తల్లిపొత్తిళ్లలో ♦ నుల్లసిలుచుండె ।
బాలికామణినిగొని ♦ జాలరిసఖులెల్ల
జలకమాడించిరి ♦ జలజలోచనలు।
జలకంబులాడించి ♦ తిలకంబుమఱిదిద్ది
బంగరుయ్యెలలోనఁ ♦ బవళింపఁజేసి ।
అంగనలుగూడియు ♦ గంగాభవానికిని
మంగళారతులను ♦ రంగుగనుబాడి ।

### పురజనులు గంగకు లాలిపాడుట

శృంగారవతులెల్ల ♦ బంగరుయ్యెలయూచి
చాలవేడుకమీఱ ♦ లాలిపాడిరిగా ।

లాలిగంగాదేవి ♦ లాలిశ్రీహరిపుత్రి
లాలిఅంబుజనేత్రి ♦ లాలిశుభగాత్రి।
లాలిసద్గుణసీమ ♦ లాలిహరిపదధామ
లాలిపుణ్యచరిత్ర ♦ లలితేంద్రువక్త్రి।
లాలిపురహరురాణి ♦ లాలిమంజులవాణి
లాలిబంభరవేణి ♦ లాలిమృదుపాణి।
పాపహారిణిలాలి ♦ పద్మలోచనలాలి
పరమపావనిలాలి ♦ భద్రఖనిలాలి।
అనియిట్లు పాటలను ♦ వినయమునఁబాడియా
సతులు గృహములకేఁగి ♦ రతులితంబుగను
రత్నాలబొమ్మవలె ♦ రమణిరంజిల్లెను
దినదినంబునచాల ♦ తెలివినొందుచును।
అంతకంతకుచాల ♦ అభివృద్ధినొందుచును
శుక్లపక్షంబువలె ♦ సొంపుమీఱుచును।
తనతల్లి నెమ్మోము ♦ తప్పకుండఁగఁజూచి
పోల్చినవ్వఁగనేర్చె ♦ పొలఁతిరత్నంబు।
బోలఁగిలఁబడనేర్చె ♦ పొత్తిళ్ళలోపలను
వెలఁదిమంచి పుటాలు ♦ వేసినట్లుగను।
ధరజలూకవితాన ♦ తర్లిప్రాకఁగనేర్చె
అంతకంతకుతప్పు ♦ టడుగులనునేర్చె।

చిలుకపలుకులరీతి ♦ చెలియమాటలు నేర్చె
ముద్దులుట్టిపడంగ ♦ మోదంబు వెలయ ।
తనయీడుగలచిన్న ♦ వనితలను కూడుకొని
అబల దాఁగిలిమూఁత ♦ లాడంగ నేర్చె ।
సంగీతసాహిత్య ♦ సరసవిద్యలయందు
గుఱుతు తెలియగ నేర్చె ♦ తరుణిరత్నంబు ।
శబ్దజాలములతో ♦ చదివి చెప్పఁగ నేర్చె
విద్వజ్జనుల్ చూచి ♦ వేడ్కనొందఁగను ।
ఇంతిచక్కదనంబు ♦ నెంచశక్యముకాదు
పున్నమచందురుని ♦ బోలు నెమ్మోము ।
నీలమేఘపుకాంతి ♦ నెనరుచుంకునుకొప్పు
అర్ధచంద్రునిబోలు ♦ అతివ నెన్నుదురు।
నల్లకలువలఁబోలు ♦ నారీమణీకనులు
అంగనకనుబొమలు ♦ సింగినీవిండ్లు ।
మానినిపలువరుస ♦ మల్లెమొగ్గలతీరు
మేలద్దములపోల్కి ♦ మెలఁత చెక్కిళ్ళు ।
బాగైనకలకంఠి ♦ నూగారు సర్పంబు
చెన్నుమీఱినసడుము ♦ సింహమధ్యంబు ।
సకియమణికివళుల్ ♦ శరధితరంగములు
పోలుపైనకన్నియకు ♦ పొన్నపువునాభి ।

కాంతామణికివీపు ♦ కదళికాపుత్రంబు
ఎలనాగపిఱుందులు ♦ ఇసుకతిన్నియలు।
చెలియకరతలములును ♦ చిగురుజొంపంబులు
అంగనపెందొడల్ ♦ అరంటిబోదియలు।
అబ్జాక్షిజంఘికలు ♦ అలరునమ్ములపొదులు
తామరసంబులు ♦ తరుణిపాదములు।
మానినీమణినడక ♦ మత్తగజయానంబు
రాకేందుముఖిస్వరము ♦ కోకిలస్వరము।
భామినీమణినవ్వు ♦ పండువెన్నెలసిగ్గు
తొలకరిమెఱపుతో ♦ తులదూగుమేను।
అంగనపలుకులు ♦ అమృతంపుమొలకలు
వనితసుందరమెన్న ♦ వశముగాదన్న।
మేలయినయట్టిర ♦ త్నాలుచెక్కినబొమ్మ
చిన్నిముద్దులగుమ్మ ♦ చెలువారుకొమ్మ।
కొమ్మగాదిదివంచి ♦ కుదురయినకెందమ్మి
తమ్మిగాదిదివంచి ♦ తళుకుపూదండ।
దండగాదిదిమేలు ♦ తరమైన చెంగలువ
కలువగాదిదివంచి ♦ ఘనమయినచిలుక।
చిలుకగాదిదివంచి ♦ చిత్తజనిచేబంతి
బంతిగాదిదిమేల్మి ♦ బంగారుగిలక।

గిలకగాదిదిసొంపు ♦ గులుకుకప్పురగంధి
గంధిగాదిది ♦ తావి గలుగు పువుబోణి।
బోణిగాదిదివంచి ♦ పొలుపైన పన్నీరు
నీరుగాదిదివంచి ♦ నేటు మిటారి।
తరుణిఁబోలినసతులు ♦ ధరణిలో పలలేరు
తరుణిసుందరమెన్నఁ ♦ దరముగాదన్న।
భువనసుందరియిట్లు ♦ పొలుపారుచుండఁగ
కయ్యాలమునివరుఁడు ♦ ఘనుఁడునారదుఁడు।
అంబరమార్గమున ♦ నతఁడుచనుదెంచుచును
కన్నులఁజూచెశ్రీ ♦ గంగమాంబికను।
వెలఁదిరూపవిలాస ♦ విభ్రమంబులుచూచి
ఆశ్చర్యమానసుం ♦ డగుచు మునివరుఁడు।
ఈభువనసుందరి ♦ యీకంబుకంధరి
యీబాలయీగోల ♦ యీపద్మగంధి।
శివునికర్పితముగఁ ♦ జెన్నారుచున్నయది
తెలిపివత్తమటంచు ♦ తెలివిదూరమున।

---

నారదుఁడు ఎఱుకవేషముదాల్చి గంగకడకువచ్చుట.

మునిరూపమునువిడిచి ♦ మోహనాకారమగు
యెఱుకతరూపంబు ♦ నపుడుదాల్చెనుగా।

పసిడికమ్మలు చెవుల ♦ బాగుగాఁ బెట్టుకొని
తీరయినకంఠమున ♦ తీగెదాల్చెనుగా ।
నీలాంబరము రవికె ♦ నిండు వేడ్కనుతొడిగి
ముక్కుముంగరతీగె ♦ మోవిపైనాడ ।
మొలవంక కడియములు ♦ ముద్దుటుంగరములు
విభూతిబొట్టును ♦ విడెముపుక్కిటను ।
శిబ్బెంపుగుబ్బలును ♦ చిందువాల్ద్రొక్కటి
గురిజపేరులు దాల్చె ♦ కుచములల్లాడ ।
పాడేటివీణెతన ♦ బాలునిగ జేసికొని
చంకకట్టుగఁగట్టి ♦ చన్నిచ్చుకొనుచు ।
పట్టయిన వేదములు ♦ బుట్టగాసవరించి
తలమీఁదఁబెట్టుకొని ♦ తానునారదుఁడు ।
యెఱుక యెఱుకోయవ్వ ♦ యెఱుకోయటంచును
జాలరివీధులను ♦ సంచరించెనుగా ।
ముచ్చటగుమాటలను ♦ మురిపెంపునడకలను
జాలరివీధులను ♦ సంచరించెనుగా ।
సారె సారెకుతాను ♦ సవతినిం దిట్టుచును
జాలరివీధులను ♦ సంచరించెనుగా ।
నాకు సరియెఱుకతలు ♦ లోకమున లేరనుచు
జాలరివీధులను ♦ సంచరించెనుగా ।

తోరంపుబంగారు ♦ తూగుటుయ్యాలలోన
ఎలమిగంగాదేవి ♦ చెలు లెల్లఁగొలువ।
తరుణిగంగాదేవి ♦ యెఱుకతమాటలు
చెవులారవిని సంత ♦ సిల్లవేడుకను।
తనదరికివేగర ♦ మ్మని దాదినంపించి
పిలిపించియెఱుక తను ♦ ప్రేమరంజిలఁగ।
నవరత్న ఖచితమా ♦ నవ్యపీఠము వేసి
కూర్చుండఁగాఁబెట్టి ♦ కొమ్మయెఱుకితను।
కూర్చుండఁగాఁబెట్టి ♦ కొమ్మయెఱుకతఁజూచి
తరుణిగంగాదేవి ♦ తానిట్టుపలికె।
అవునెయెఱుకలసాని ♦ ఆత్మలోనేనొక్క
తలఁపుచేసితినిపుడు ♦ తప్పకుండగను।
మఱిదాఖలాపడఁగ ♦ మగువచెప్పితి వేని
అడిగినంతపదార్థ ♦ మందఁజేసెదను।
తగినకోరిక చెప్పఁ ♦ దగినదానివిధాన
యున్నట్టుతోఁ చెసి ♦ యునికి నామదికి।
అని గంగపలుకంగ ♦ అపుడు యెఱుకలసాని
గంగతోఁబలికెను ♦ ఘనతమీఱఁగను।
వినవెనాతల్లియా ♦ విశ్వంబులోపలను
ఎఱుకవారలు ఎంద ♦ రెందఱో గలరు।

నాకుసరియెఱుకతలు ♦ లోకమందున లేరు
సిద్ధమయినయెఱుక ♦ చెప్పనే లేరు।
నాయెఱుక నేకదా ♦ నాగకంకణధరుఁడు
పరఁగగౌరీదేవి ♦ పరిణయంబగుట।
నాయెఱుక నేకదా ♦ నాకాధిపతి ముందు
పడఁతిశచీదేవి ♦ పరిణయంబగుట।
నాయెఱుక నేకదా యీ ♦ అవనిచక్రమున
జరగుచుండినయట్టి ♦ పరిణయములన్ని।
కైలాసగిరినున్న ♦ గౌరీమహాదేవి
కెఱుకను జెప్పేటి ♦ యెఱుకతను నేను।
బ్రహ్మపట్టణమున ♦ భారతీదేవికి
యెఱుకను జెప్పేటి ♦ యెఱుకతను నేను।
చెలఁగి వైకుంఠమున ♦ శ్రీలక్ష్మి దేవికిని
యెఱుకను జెప్పేటి ♦ యెఱుకతను నేను।
తెలియంగముక్కోటి ♦ దేవతాస్త్రీలకును
యెఱుకను జెప్పేటి ♦ యెఱుకతను నేను।
నరులకును జెప్పేటి ♦ యెఱుకతను నే గాను
దివమందు విహరించు ♦ దివ్యకన్యకను।
ఎల్లవారలకునా ♦ యెఱుక లేకుండంగ
తెలియవే సంగతులు ♦ తేటతెల్లముగా।

బంగారుచేటలో ♦ పలఁబోసి వేగమున
తేవమ్మ ముత్యాలు ♦ దివ్యరత్నములు।
వెలఁది నీ కోరికలు ♦ వివరించి చెప్పెదను
తేవమ్మ ముత్యాలు ♦ దివ్యరత్నములు।
అని యిట్లుపలుకంగ ♦ ఆగంగమాంబిక
తెప్పించె ముత్యాలు ♦ దివ్యరత్నములు।
బంగారుచేటలో ♦ పలఁబోసి ముత్యములు
తనచేతఁబట్టుకొని ♦ తా గంగమాంబ।
ఫాలమునఁ జేర్చుకొని ♦ పార్వతీనాథుండు
తనకు విభుఁడగునోయని ♦ తలఁచి మ్రొక్కెనుగా।
చేతిలోముత్యములు ♦ చేటలోపలఁబోసి
ముదముతో ఎఱుకతకు ♦ ముందరని డెనుగా।
మాయ యెఱుకతసాని ♦ మగువ మ్రొక్క గ్రహించి
యిల్లు వెల్పులను బ్రా ♦ ర్థింపఁదొడఁగెనుగా।
స్వామిశ్రీయఃపతి ♦ శంఖచక్రధరుండ
అఖిలాండకోటిబ్ర ♦ హ్మాండనాయకుఁడా।
పట్టయిన వేదముల ♦ బ్రహ్మకిచ్చినతండ్రి
సింహాద్రిఅప్పన్న ♦ శ్రీజగన్నాథ।
కాశివిశ్వేశ్వర ♦ గజచర్మధారుఁడా
కామితములీడేర్చు ♦ కాలభైరవుఁడ।

ఓబమ్మయిల్లాల ♦ ఓసరస్వతిదేవి
నాకుతోడగుమమ్మ ♦ నిన్నుమ్రొక్కెదను।
జిహ్వఁబాయకయుండు ♦ శ్రీకాళికాశక్తి
విఘ్నములుతొలగించు ♦ విఘ్నేశ్వరుండ।
బెజవాడలోనున్న ♦ పేరయిన ఓదుర్గ
కొల్లాపురీతల్లి ♦ కోరెదను నిన్ను।
జగముకంతయుతల్లి ♦ జన్నాడకామాక్షి
హుజనీమహంకాళి ♦ ఓయాదిశక్తి।
ఓయాదిలక్ష్మమ్మ ♦ ఓలోకములమాత
తోడునీడయిమాకు ♦ తోడుగావమ్మ।
మదిలోనివాక్కమ్ము ♦ మధురమీనాక్షమ్మ
బంగారువాక్కమ్ము ♦ భ్రమరాంబ నాకు।
కలిగినవాక్కమ్ము ♦ కంచికామాక్షమ్మ
తలఁచినవాక్కమ్ము ♦ తగుశారదమ్మ।
ఒప్పయినవాక్కమ్మ ♦ ఓఅసిరిపోలమ్మ
తెలివయినవాక్కమ్ము ♦ దేవదేవమ్మ।
అనుచునిలువేలుపుల ♦ అందరినిఁగొనియాడి
శ్రీగంగమాంబిక ♦ చెయిపట్టుకొనియె।
మగువసంతోషింప ♦ మాయయొకటపలికె
ఓతల్లిజగదంబ ♦ ఓగంగమాంబ।

భాగ్యంబుగలచెయ్యి ♦ ప్రఖ్యాతిగలచెయ్యి
సంతానఫలమయిన ♦ చక్కని చెయ్యి।
ఒక్క కోరికె చేసి ♦ యున్నా వెనాతల్లి
కాయొపండో యనుచు ♦ కలువరించేవు।
కాయగాదే పండు ♦ కల్లగాదే నిజము
శీఘ్రంబ యింతలో ♦ చేకూరునమ్మ।
మెలనాగ నీకది ♦ యెన్నాళ్ళకంటేను
ఒకటి రెండును మూఁడు ♦ సకియ చెప్పెదను।
ఒకటియనఁగానదియు ♦ నొకయేఁడుగాదమ్మ
రెండు అంటేను మఱి ♦ రెండేండ్లుగావు।
మూఁడు అంటేనవియు ♦ మూఁడేండ్లుగావమ్మ
సిద్ధమయియున్నదే ♦ చెలియ నీతలఁపు।
కలుషహారిణివగు ♦ గంగాభవాని
శాపముననిచ్చోట ♦ జననమైతివిగా।
మగవేల్పు నీకొక్క ♦ మగఁడుగానున్నాఁడు
శర్వాణిసతి నీకు ♦ సవతిగాఁగలదు।
గిరిజ నెప్పుడు నీవు ♦ క్రిందుపరచెదవమ్మ
కరకంఠు శిరమెక్కఁ ♦ గలవు నాతల్లి।
నీవుపుట్టినతావు ♦ నిజమెఱుఁగ డీశ్వరుఁడు
నే పోయి చెప్పెదను ♦ నీ తెఱంగెల్ల।

విక్రమంబు గాహరుండు ◆ వినుఁ జూడవచ్చునే
నిప్పుకంటి దేవునికి ◆ వదలుటిది లేదు।
పరిణయము గాకుండ ◆ తిరిగి వెడలఁడు శివుఁడు
నా పూర్వజన్మముగా ◆ నమ్మవే తల్లి।
కల్లగాదను మేను ◆ గరళకంఠుని సాక్షి
పుత్రపౌత్రములగ ◆ నాబుట్టతోడు।
అగ్నిసాక్షిగ నిచ్చు ◆ హరుఁడు పరిణయమయిన
తరువాత మెచ్చెదవు ◆ తల్లి కోనన్ను।
అనుచు నెఱుకత పలుక ◆ ఆనందమును బొంది
తన యెఱుకతను మెచ్చి ◆ తా గంగమాంబ।
నెమ్మి యిచ్చెద నీకు ◆ ఇంతి ఏబుణమనుచు
కౌఁగిలిం గావించి ◆ కడు గారవించి।
దివ్యహారము లిచ్చి ◆ దివ్యాంబరములిచ్చి
మాణికకాంచన ◆ స్నానమాడించి।
ఆనందభరితమై ◆ అప్పుడు ఎఱుకులసాని
సెలవిచ్చి గంగాదేవి ◆ సెలవు గైకొనెను।

---

నారదుఁడు ఎఱుకతరూపము విడిచి కైలాసగిరికిఁ బోవుట.

తనదు ఎప్పటిరూపు ◆ దాల్చి రజతాద్రికిని
పయనమైపోయెను ◆ పరమమునివరుఁడు।

కయ్యాలమునివరుఁడు ♦ కైలాసగిరి కేఁగి
చిఱునవ్వునవ్వుచును ♦ చెన్ను మీఱుచును ।
బ్రహ్మాదులిరువంక ♦ ప్రస్తుతులుగావించి
ప్రమథకోటులుచుట్టుఁ ♦ జేరి సేవింప ।
పరమర్షి వర్గములు ♦ ప్రార్థనలుగావింప
వామభాగమున పా ♦ ర్వతిదేవియుండె ।
గంధర్వకిన్నరులు ♦ గానవిద్యలు సేయ
అప్సర స్త్రీలు నా ♦ ట్యములాడఁగాను ।
రత్నాలగద్దెపై ♦ రంజిల్లుచున్నట్టి
శంకరునిపొడగాంచి ♦ సన్మునీశ్వరుఁడు ।
శరణార్థియనుచు హ ♦ స్తములనుజోడించి
మనవొక్కటున్నది ♦ మముఁగన్నతండ్రి ।
పాహివిశ్వేశ్వర ♦ భవరోగసంహార
గౌరీమనోహర ♦ కలుషవిదూర ।
ముజ్జగంబులకెల్ల ♦ మూలదుంపవునీవు
నీకుసరిదైవములు ♦ లోకమున లేవు ।
నిఖిలలోకములందు ♦ నివెఱుఁగనిది లేదు
కన్నులకొకవింత ♦ కనుపించె నేఁడు ।
ఏలూరిపురములో ♦ జాలరివీధిలో
కంటినొకసుందరిని ♦ కన్యకామణిని ।

ఇతరమెఱుఁగనిబాల ♦ యెన్నంగకడులోల
ఘనలసద్గుణజాల ♦ కడుపుణ్యశీల।
వన్నెమీఁటినకలువ ♦ వాసించుచెంగలువ
అలరుకప్పురగంధి ♦ అందాలగంధి।
తగునునీకాసతి ♦ తగుదునీవాసతికి
సంకల్పసిద్ధుఁడవు ♦ సర్వేశనీవు।
విరహతాపముచేత ♦ వేగుచున్నదియామె
కన్యకామణిపైన ♦ కరుణించవయ్య।
అనినారదుఁడుపలుక ♦ ఆగౌరినాథుండు
కనుసైగచేసెను ♦ ఘనుఁడుశంకరుఁడు।
కనుసైగగావించి ♦ తనువిరహతాపమున
మనసుతత్తఱపాటు ♦ గొనిశంకరుండు।
మనసుతత్తఱపాటు ♦ గొనిశంకరుండపుడు।
సభికులనందఱిని ♦ సాగిపొండనుచు।
అంత బ్రహ్మాదులను ♦ అందఱనుపీడ్కొలిపి
కలకంఠిపార్వతికి ♦ తెలియకుండఁగను।
కైలాసగిరినున్న ♦ ఘనులకెవ్వరికిని
తానువెళ్లినజాడ ♦ కానరాకుండ।
కామాంధమునఁజిక్కి ♦ గారెఱుగకుండంగ
తానొక్కఁడేహరుఁడు ♦ పైనమైవెడలె।

శివుడు గంగనుజూచుటకై హేలాపురంబునకు వెడలుట.

---

కైలాసగిరి వెడలి ♦ గంగానివాసమగు
ఏలూరిపట్నమున ♦ కేఁగెనీశ్వరుఁడు ।
ఏవంకఁజూచినను ♦ హేమశోభితమయిన
పట్నంబు కళ్యాణ ♦ పదమునచుండె ।
అంతఃపురంబులు ♦ ఆటకూటంబులు
కనకమండపములు ♦ గలిగివర్ధిల్లె ।
పవడంపు స్తంభములు ♦ పచ్చతోరణములు
కలియుగస్వర్గమై ♦ కనుపట్టియుండె ।
సొంపుమీఱినసోమ ♦ సూర్యవీధులుగలిగి
వృషభటెక్కెములతో ♦ విలసిల్లెపురము ।
మంగళపదములు ♦ మహితవాద్యంబులు
శంకునాదంబులు ♦ చాలఁగానుండె ।
కన్నులపండువు ♦ గాఁజూచి యీశ్వరుఁడు
వివరముగజాలరి ♦ వీధి కనఁడాయె ।
వివరముగజాలరి ♦ వీధినిగన లేక
తానువేగమెనీళ్ళ ♦ కోనేటికరిగె ।
నీళ్ళాటిరేవుపయి ♦ నిలిచియచ్చోటికి
నీళ్ళకువచ్చేటి ♦ నెలఁతలనుజూచి ।

భామినులార యీ ♦ పట్నవాసమునందు
జాలరివీధేది ♦ సరిచెప్పుఁడనిన।
విని కాంతలందఱు ♦ విశ్వేశుపాడగాంచి
వినుపింపఁదొడఁగిరి ♦ వీధులేర్పడఁగ।
పసుపుచెట్టున్నది ♦ పరఁగ బ్రాహ్మణవీధి
జమ్మిచెట్టున్నది ♦ క్షత్రియులవీధి।
విరజాజియున్నది ♦ వెలయకోమటివీధి
సురసాలమున్నది ♦ శూద్రులకువీధి।
సరసిజమున్నది ♦ పరమవైష్ణవవీధి
పువుతోటయున్నది ♦ శివభక్తవీధి।
దానిమ్మయున్నది ♦ తగును తుమ్మలవీధి
పీడెమానున్నది ♦ వేపారివీధి।
మందారమున్నది ♦ మహిమపండావీధి
కుసుమచెట్టున్నది ♦ గుజరాతివీధి।
పాలమ్రానున్నది ♦ శీలవంతులవీధి
కలపొన్నయున్నది ♦ కంసాలవీధి।
శింశువంబున్నది ♦ చిట్టికర్ణపువీధి
చామంతియున్నది ♦ జంగాలవీధి।
కరవీరమున్నది ♦ కాపుధనములవీధి
మొగిలిచెట్టున్నది ♦ తగవెలమవీధి।

నిమ్మచెట్టున్నది ♦ కమ్మ వెలమలవీధి
మద్దిమ్రానున్నది ♦ పెద్ద వెలమలది।
జంబీరమున్నది ♦ సరగవంటరవీధి
వరసాలయున్నది ♦ పెరికీలవీధి
అరఁటిచెట్టున్నవి ♦ పరఁగుతెలగలవీధి
పనసచెట్టున్నది ♦ బలిజలవీధి।
పవడంబులున్నది ♦ పద్మసాలెలవీధి
బదరీకమున్నది ♦ పట్టుసాలెలది।
మారేడుఉన్నది ♦ మహాకర్ణికులవీధి
దేవదారున్నది ♦ దేవాంగవీధి।
తులసిచెట్టున్నది ♦ వెలయదాసరివీధి
కురువిందయున్నది ♦ కుమ్మర్లవీధి।
పొన్నమ్రానున్నది ♦ భోగకాంతలవీధి
తమ్మిమ్రానున్నది ♦ దాసీలవీధి।
తెలికమ్రానున్నది ♦ దేవతెలుకలవీధి।
జాబరాయున్నది ♦ జట్టీలవీధి।
మొల్లంగియున్నది ♦ ముత్తరాచలవీధి
గంగరేగున్నది ♦ కాళింగవీధి।
జిండిస్తుఉన్నది ♦ జెలగుతెలకలవీధి
ఉసిరిమ్రానున్నది ♦ ఉప్పర్లవీధి।

వెలగమ్రానున్నది ♦ యలరుగొల్లలవీధి
    పరిమ చెట్టున్నది ♦ భట్రాజువీధి।
పోకమ్రానున్నది ♦ పోసఁగచాకలివీధి
    మఱ్ఱిమ్రానున్నది ♦ మంగళ్ళవీధి।
నిత్యమల్లున్నది ♦ నెరయదర్జీవీధి
    బొడ్డుమల్లున్నది ♦ పొండీలవీధి।
ఈతమ్రానున్నది ♦ ఎసఁగుసేఁడిగవీధి
    మేడిమ్రానున్నది ♦ మేదర్లవీధి।
బూర్జమానున్నది ♦ పొసఁగునెయ్యాలవీధి
    చందనంబున్నది ♦ జాలర్లవీధి।
అనియిట్లు వేశ్యేర ♦ అన్నివీధులగుఱుతు
    విన్నవించిరి స్త్రీలు ♦ విశ్వేశునకును।
విని వామదేవుండు ♦ తను చాలముదమందె
    అంతలో సూర్యుండు ♦ అస్త్రాద్రికరిగె।
పరఁగగూళ్ళకుఁజేరె ♦ పక్షిసముదాయములు
    సంజచీఁకటిగ్రమ్మె ♦ జగముకంతటికి।
వికసించె కలువలు ♦ ముకుళించెతామరలు।
    వినువీధినిండంగ ♦ వెలసెతారకలు।
జగముతేటగిలంగ ♦ చంద్రోదయంబయ్యె
    పండువెన్నెలనభో ♦ భాగంబువెలసె।

శివుఁడు జంగమవేషముతో గంగాదేవిని జూచుట.

అపుడు గౌరీనాథుఁ ♦ డంతరంగమునందు
గంగకునుతనరూపు ♦ గానరాకుండ ।
తనరూపమంతయును ♦ తా నెచ్చటనో విడిచి
జంగమవేషంబు ♦ సవరించుకొనెను ।
కడుముసలిరూపంబు ♦ మెడనురుద్రాక్షములు
కక్షపాలవిభూతి ♦ కరకమండలము ।
ముసిడిగింజలపేర్లు ♦ మొలనిండచర్మంబు
కురుచకౌంజడలును ♦ కుచ్చులబొంత ।
భసితపుండ్రంబును ♦ పైపెద్దపులితోలు
కర్ణకుండలములు ♦ గందంపుబొట్టు ।
పటికంపుపేరులు ♦ పాదంబునొకగజ్జె
ఒకచేతకప్పెర ♦ ఒకటశూలంబు ।
ఎడమభుజమునసంకు ♦ పిడికిటనుఒకగంట
గొడుగు పావలుకాళ్ళ ♦ దొడిగెశంకరుఁడు ।
ఆపట్టణముచొచ్చి ♦ అన్నివీధులయందు
కపటమార్గపుభిక్ష ♦ గావించెశివుఁడు ।
గంటవాయించి శం ♦ ఖంబూదుకొనుచుఁదా
జాలరివీధులను ♦ జనుదెంచెశివుఁడు ।

సాంద్రమీనులకంపు ♦ సొరదిమిన్నంటఁగను
పచ్చిచేఁపలకంపు ♦ పరిఢవించెనుగా।
మురికిచేఁపలకంపు ♦ తరముగాకుండెనట
కుళ్ళుచేఁపలకంపు ♦ కొల్లలైయుండె।
ఎండుచేఁపలకంపు ♦ ఏకమైవెలసెమఱి
పొలసుచేఁపలకంపు ♦ నిలకడయియుండె।
జుమ్మునియీఁగలు ♦ సొలపుచునుకొట్టెమఱి
నల్లచీమలబారు ♦ కొల్లలయియుండె।
ఉమియకనురోయకను ♦ ఉల్లంబుచెదఱకను
ముక్కుమూయకకనులు ♦ మూయంగఁబోక।
ఆత్తలోపలనేమి ♦ అసహ్యపడకుండ।
జాలరివీధులకుఁ ♦ జనుదెంచెశివుఁడు।
ఆజాతిశివయోగి ♦ ననుచుభిక్షుడుగుచును
శంకుదేవయయిల్లు ♦ చక్కఁజేరెనుగా।
భిక్షయనిశంభుండు ♦ పిలువఁగావేగమున
కలహంసగామినై ♦ గంగాభవాని।
బాగయినబంగారు ♦ తూఁగుటుయ్యెలదిగి
ఉలికిపాటునవచ్చి ♦ ఒయ్యారిగంగ।
కరకంకణాదులు ♦ ఘల్లుఘల్లుమనంగ
తీగెమెఱుపువిధాన ♦ దేహంబుమెఱయ।

సకియసకలపదార్ధ ♦ సంపన్నమైనట్టి
అన్నంబుభిక్షుగా ♦ హరునికొసఁగెనుగా।
భిక్షుగొనిశంభుండు ♦ పిలిచిననుపలుకకను
శివశివయనుచు తా ♦ శివగుడికితర్లె।
జంగమవల్లభుఁడు ♦ సాగిపోవుటఁజూచి
గంగమాంబికచాల ♦ కళవళంప డెను।
ఇదియేమిదైవమా ♦ యీజంగమవిభుండు
మాటాడకుండంగ ♦ మళ్లిపోయెనుగా।
నిలువఁడాయెను ఒక్క ♦ నిమిషమైననుగాని
ఇరుగుపొరుగులభిక్ష ♦ యిమ్మనుట లేదు।
చాలునని అనఁడాయె ♦ చాలదని అనఁడాయె
భయమేమి తనకిట్లు ♦ పారిపోవుటకు।
జంగంబుగాఁడితఁడు ♦ సాక్షాత్తుశంభుండు
ననుచూడవచ్చిన ♦ నాథుండు నిజము।
యెవరినడుగనిభిక్ష ♦ యీయింటఁగై కొనెను
కను తేరిచూడ కే ♦ మనకుండఁజనెను।
జంగమై తేయిట్లు ♦ సన్నసన్నగఁబోఁడు
నిజముగాజంగంబు ♦ నీలకంధరుఁడు।
నాగకంకణధరుఁడు ♦ ననుఁజూడవచ్చునని
చెలియ యెఱుకులదుండి ♦ చెప్పిపోయెనుగా।

తరుణిచెప్పినమాట ♦ దాఖలాగా నేడు
తనకుదర్శనమాయె ♦ ధవళవర్ణుండు।
ధవళవర్ణునిబాసి ♦ తానెట్లుభరియింతు
అలిగిపోయినరీతి ♦ ఆతండుచనెను।
పతినిగూడనిభోగ ♦ భాగ్యంబులేటికని
తల్లడంబునుచెందె ♦ ధవళాయతాక్షి।
మన్మథుండంతటను ♦ మాటుకొనిబాలపై
విరిశరంబులుపఱపె ♦ వేలకొలఁదిగను।
కామాంధకారమున ♦ నేమితోఁచకబాల
తలకట్టుకొనివలపు ♦ తాళజాలకను।
మాటుమాలను నులక ♦ మంచంబుమీఁదను
నిండముసుగిడి పండు ♦ కుండెమూల్గుచును।
చాలరాతిరియయ్యె ♦ బాల తిండికిరాదు
ఆఁకలిక్రొకగడియ ♦ ఆగేదికాదు।
ఇంతసేపాయె బా ♦ లేమి తిండికిరాదు
చక్రమ్మగుండియలు ♦ ఝలుఝల్లుమనెను।
అందందుతిరుగుచును ♦ అన్నిదిక్కులు వెదకి
ఇఁకయేమిదైవమా ♦ యనుచు భీతిలుచు।
మాటుమాలనునులక ♦ మంచంబుమీఁదను
పవళించియున్నట్టి ♦ బాలికనుజూచి।

గుం డెఝల్లుమటంచు ♦ కొమ్మదగ్గిరవచ్చి
చిన్నఁబోయిన మోము ♦ కన్నులనుజూచె।
ఇదియేమినాతల్లి ♦ యీలాగునున్నావు
వన్నెమీఱినవగలు ♦ వాడియున్నావు।
పలుకవెందుకునీవు ♦ అలుకేలచేసితివి
యెవ్వరేమనిరి నీ ♦ కేమిలోపంబు।
ఏమిగావలెను నీ ♦ కేపదవిలోపంబు
మఱుగుపెట్టకనాకు ♦ నెఱిగించవమ్మ।
అన్నంబుమాని నీ ♦ వలుకేలచేసితివి
నీమనోవ్యాథేమి ♦ నీతలంపేమి।
ఇపుడువచ్చిన జంగ ♦ మేశ్వరుని పొడగాంచి
జడిసియున్నావేమొ ♦ సకియనాతల్లి।
అబలనేనుండంగ ♦ ఆమిండజంగముకు
భిక్షునీవేమిటికి ♦ పెట్టఁబోయితివి।
మాయజంగాలు సా ♦ మర్థ్యవంతులువారు
మంత్రించివేతురే ♦ మాయవిభూతి।
కలవుపాడుపిశాచ ♦ ములు వారివెంట
విడిచెనోనీమీఁద ♦ పెనుభూతమొకటి।
వెఱ్ఱిజంగముజూచి ♦ వెరపుచెందితివేమొ
తల్లికిని బిడ్డకును ♦ దాఁపేలచెపుమా।

తప్పయిన యొప్పయిన ♦ తల్లితో సుతబిడ్డ
చెప్పవచ్చును శాస్త్ర ♦ సిద్ధమనివినవె।
ఆకుచాటునకాయ ♦ అమరియున్న విధాన
తల్లిచాటునబిడ్డ ♦ దాగుండవచ్చు।
తల్లిచాటునయెంత ♦ తప్పుచేసినగాని
అదిపయికిఁబోదెంత ♦ దైన లోకమున।
నేను తల్లిని గనుక ♦ నీవు దాఁచక చెప్పు
నీదుకోర్కెమైన ♦ నిజముగావింతు।
అని పల్కఁగా గంగ ♦ అంతరంగమునందు
సిగ్గునను భయమునను ♦ చెప్పఁజాలకను।
చెప్పకతీరదని ♦ చివరకుఁదలపోసి
కలకంఠిగద్గద ♦ కంఠయైపలికె।
ఓతల్లిచక్రమ్మ ♦ ఒప్పుగావినవమ్మ
నీకుఁ జెప్పకపోతె ♦ నాకేమి తెరువు।
నీతోడఁజెప్పవలె ♦ నీవు సమకూర్చవలె
నీకుమించినవారు ♦ నాకెవరుగలరు।
గర్భవాసమునందుఁ ♦ గన్నతల్లివినీవు
తప్పుచేసిననీదె ♦ ఒప్పయిననీదె।
ఇంటింటభిక్షుంబు ♦ ఇప్పుడడిగినయట్టి
జంగమదేవర ♦ శంకరుఁడుసుమ్మి।

నామీఁదవలపుచే ♦ నన్నుఁ జూచేకొఱకు
వచ్చిభిక్షముఁబట్టి ♦ వలచిపోయెనుగా ।
పాడుగుళ్ళోఁచేరి ♦ పరమేశుఁడున్నాఁడు
అతనినన్నును గూర్చ ♦ వమ్మయీక్షణము ।
జంగమవిభుఁడనుచు ♦ సందేహపడితివా
విషముపానముచేసి ♦ విడుతు ప్రాణంబు ।
అతనిపయి నాకాస ♦ యధికమైయున్నయది
జంగమవిభుఁడనుచు ♦ చౌకసేయకుమి ।
అని గంగపలుకంగ ♦ ఆశ్చర్యమునుబొంది
వెరవుమతిలోఁబుట్టి ♦ వెలఁదితోననియె ।
యేమినాతల్లినీ ♦ విట్టిమాటాడితివి
పసిబాలనీవు యే ♦ పాపమెఱుఁగవుగా ।
ముష్టిజంగముఁజూచి ♦ మోహపడ్డావేమొ
ఇదియేమిపాపమో ♦ యెఱుగంగరాదు ।
మాయజంగమువాఁడు ♦ మరులుకొల్పఁగనిట్లు
మరులేలకొంటివే ♦ మంకుజంగముకు ।
మరులేలకొంటివే ♦ మంకుజంగముకీవు
పోలఁతిరోసికిది ♦ బుద్ధికాదమ్మా ।
వలపురూపెఱుఁగదను ♦ వార్తభువిలోపలను
చెప్పినమాటలు ♦ చేస్తివేతల్లి ।

నీబుద్ధి లేమాయె ♦ నీనీతు లేమాయె
త్రిప్పికొట్టకయెట్లు ♦ తిరిగె నీమనసు ।
అబలనీవెక్కడ ♦ ఆజంగమెక్కడ
నవ్వారో కనుగొన్న ♦ నరులెల్ల నిన్ను ।
చాన మనజాలరి ♦ జాతి మహా చెడ్డది
వెలివెయ్యరా మన ♦ కులమంతగూడి ।
వెలివెయ్యడముకాక ♦ కులమంతకూడుకొని
తప్పు తెమ్మందురే ♦ తగ కోటిధనము ।
తప్పిచ్చుకొననేల ♦ దండంబులననేల
అలరువెలందులలోన ♦ నపకీర్తియేల ।
కక్కుర్తిపడితేను ♦ కడుపు నిండగవలెను
కడుపునిండనియట్టి ♦ కక్కుర్తియేల ।
కులములోపల మహా ♦ గొప్పవానికి నిన్ను
ఇవ్వవలెనంచుమే ♦ మెంచుకొన్నాము ।
నీవ్రాత యిట్లుండె ♦ నీ వేమిచేసేవు
వ్రాతకొలందిగమాట ♦ వస్తుందినోట ।
కులమువానికిమాని ♦ కొమ్ముజంగానకు
నిన్ను సమకూర్తునని నే ♦ పలుకలేను ।
నీవుకోపించినా ♦ నీవెన్ని తిట్టినా
జాతిమాలినమాట ♦ సయిపదే నాకు ।

అనితల్లి పలుకంగ ♦ అతిభీతినొందుచును
తరళాక్షి శ్రీగంగ ♦ తల్లితోఁబలికె ।
జంగంబుగాడితఁడు ♦ సాక్షాత్తుశంకరుఁడు
నాజీవితేశుండు ♦ నాప్రాణసఖుఁడు ।
సారెసారెకు నీవు ♦ జంగంబువాఁడని
పలుకఁబోకే తల్లి ♦ పాపంబువచ్చు ।
అష్టతనువులమూర్తి ♦ అంధకాసురవైరి
నాకేశవందితుఁడు ♦ నాగకంకణుఁడు ।
ననుఁజూడవలెనంచు ♦ మనమునుద్దేశించి
వచ్చినాఁడమ్మ మన ♦ వాడలో కిపుడు ।
అపరాధములునోట ♦ అనఁబోకు పాపంబు
మాటలు చెప్పఁగఁబోకు ♦ మాయమ్మ కాన ।
నామనవి చెల్లించి ♦ నాపయిని కరుణించి
అంబికేశునకు న ♦ న్నర్పించవమ్మ ।
అంబికేశునకు న ♦ న్నర్పించకుంటివా
విడుతునే ప్రాణంబు ♦ వేయి యికనేల ।
అని బిడ్డపలుకంగ ♦ అయ్యొ యోయనుచును
బాలికామణితోడఁ ♦ బలికెచక్రమ్మ ।
నాతల్లి నాయమ్మ ♦ ననుఁగన్నతల్లిరో
పసిబాల నీకెంత ♦ పంతంబు వద్దె ।

మాయజంగమువాఁడు ♦ మరులుకొల్పెను నిన్ను
నాగకంకణుఁడనుచు ♦ నమ్మియున్నావు ।
నిజముగా జంగంబు ♦ నిటలాక్షుఁడయితేను
సుదతికో సంసార ♦ సుఖ మెఱుఁగవద్దా ।
హరుని సంసారంబు ♦ అదియెట్టులంటివా
వినుపించెదను నేను ♦ వినవె నాతల్లి ।
పెట్టపాములు లేవు ♦ పెనుఁబాము లేగాని
పుయ్యి గంధము లేదు ♦ బూడిదేగాని ।
కట్టకోకలు లేవు ♦ గజచర్మమే కాని
పునుకకంచముగాని ♦ తినగిన్నె లేదు ।
ఎక్క వాహనములే ♦ దెద్దుగుఱ్ఱమె కాని
తలకు పువ్వులు లేవు ♦ నెలపువ్వు కాని ।
ఉండయిల్లా లేదు ♦ వండ పొయ్యా లేదు
ఊళ్ళోను భిక్షంబు ♦ గుళ్ళోను నిద్ర ।
విషముపాన మొనర్చె ♦ వెఱ్ఱిబాగులవాఁడు
బట్టకట్టఁడు దిగం ♦ బర వేషధారి ।
యింతిరో చూడఁగా ♦ ఎగుదిగుకన్నులు
మెడను రుద్రాక్షలు ♦ మేనంత బొల్లి ।
కడు వేడుకనువల్ల ♦ కాళ్ళందుఁ దిరుగును
సహవాస మాపిశా ♦ చములతో నుండు ।

పెనుఁబాము కంకణము ♦ పెద్ద పేదఱికంబు
దిక్కుమాలినవాఁడు ♦ పెక్కువ్యసనములు ।
రసములుడిగినమహా ♦ ముసలిరూపమువాఁడు
కులగోత్రములు రెండు ♦ తలఁపంగ లేవు ।
శాంతచిత్తుఁడుగాఁడు ♦ చపలస్వభావుండు
బహు తామసగ్రహుఁడు ♦ పరమధూర్తుండు ।
పునుకపేరులుమెడను ♦ పొలుపార ధరియించి
ఎవ్వారు ముట్టని ♦ యెముకలేదాల్చు ।
బాలరో నీవెఱ్ఱి ♦ బంగారమైపోను
ఇట్టివానిని నీవు ♦ ఎట్లు వలచితివి ।
వనితరో కాకి ము ♦ క్కున దొండపండువ్రే ।
లాడఁగట్టినతీఱు ♦ హరునికాపురము ।
హరునితో కాపురము ♦ నాసించుమని చెప్పి
ఉవిదరో యెవతెనీ ♦ యుసురోసుకొనిరి
ఇంతినిన్నిట్లు భం ♦ గింపఁజేసిరిగాని
శూలితోడుతపొందు ♦ సుకము లేదమ్మ ।
తలఁపోయ లోకముకు ♦ దైవమతఁడేగాని
ఇంపార బ్రతుకు సుఖ ♦ మెఱుఁగఁడోయమ్మా ।
అదిగాక పార్వతి ♦ ఆలిగల దాతనికి
ఆలిమీఁదను పెళ్లి ♦ అదితరమెకాదు ।

సాగని బ్రతుకొకటి ♦ సవతిపోరొక్కటి
కలపుట్టెను నీకు ♦ ఈపాపబుద్ధి ।
ఎన్ని భాగ్యములున్న ♦ ఎన్ని సౌఖ్యములున్న
సవతిమీఁదను బ్రతుకు ♦ చప్పనేసుమ్మీ ।
పదివేలుకలిగినా ♦ పదిలక్షలుండినా
సవతిమీఁదను బ్రతుకు ♦ చప్పనేసుమ్మీ ।
సవతిమీఁదను బ్రతుకు ♦ సతికియెంతయినను
దొంగతనమేకాని ♦ దొరతనములేదు ।
అలుకన్న విభువద్ద ♦ అలుకలేచెల్లవు
పోరుకుమూలంబు ♦ ఈరాలిబ్రతుకు ।
దొప్పక్రిందను జేరి ♦ దోసిలొగ్గినరీతి
తృప్తిగా ఆఁకలి ♦ తీరదేయమ్మా ।
అఖిలంబు నెఱిఁగి ♦ అవివేకిచందమున
ఈరాలిమీఁది బ్రతు ♦ కెంచుకున్నావు ।
ఆఁడుబిడ్డలబ్రతుకు ♦ అందమైయుంటేను
తల్లిదండ్రులమనసు ♦ తనివినొందునుగా ।
ఆఁడుబిడ్డకులేమి ♦ అత్తింటఁగలిగితే
తల్లితండ్రులమనసు ♦ తల్లడిల్లునుగా ।
వనితలోభువిలోన ♦ వ్రతముచెడ్డాగాని
సుఖమయినదక్కవలె ♦ సౌరిదిజీవులకు ।

సుఖమెఱుంగని బ్రతుకు ♦ సున్నమెయ్యని విడెము
రసికహీనపుసభ ♦ రవిలేని పగలు।
మానహీనునిపొందు ♦ మంత్రిగల్గని రాజు
గతిలేనిజీవనము ♦ మితిలేని నిద్ర।
దీపంబులేనిల్లు ♦ దీనమనుజుని తగవు
కవితమెఱుఁగని వ్రాఁత ♦ చవిలేని మేఁత।
తెన్నుమాలినదారి ♦ వన్నెమాలినసాని
కలువలేనికొలంకు ♦ నెలలేనిరాత్రి।
ఇవి అన్నియును కనుల ♦ కింపుగాకుండునే
నెలఁత పసిబాలవై ♦ తెలియఁజాలవుగా।
అనియిట్లు చక్రమ్మ ♦ అబలకేర్పరచంగ
కోడిపుంజులుకూసె ♦ కుక్కురోయనుచు।
కొమరొప్ప తూర్పువేఁ ♦ కువచుక్క మొలిచెను
కావుకావనికూసె ♦ కాక సంఘములు।
తూరుపు తెలవాఱె ♦ తారకలు కళదప్పె
వికసించెపద్మములు ♦ ముకుళించుతోవలూ।
నెలఁతపయిమోహమున ♦ నిదురకన్నులరాక
పాడుగుళ్ళోనుండె ♦ పరమేశ్వరుండు।
తెల్లవాఱకముందె ♦ తిరుగ జాలరివాడ
పలుమాఱు భిక్షుయని ♦ పలుకుచుండెనుగా।

చక్రమ్ము వేగమున ♦ జలదరింపుచు వచ్చి
ఇటు రాక యని పలికి ♦ యెదురుగా నిలిచి।
జంగమయ్యా నీవు ♦ జాలరివాడలను
భిక్ష మడుగుటయెట్లు ♦ ప్రియమయ్యెనీకు।
కర్తుర్తి జంగంబు ♦ గాకుంటె యీరీతి
సారె సారెకు రాఁగ ♦ చందమా నీకు।
మాచేతియన్నంబు ♦ మనసు నీకెటు తాళె
నీచు వేసేటిచెయి ♦ నిత్యంబుమాది।
పాలసు వేసేటిచెయి ♦ ప్రొద్దుప్రొద్దుకుమాది
ముణికి వేసేటిచెయి ♦ ముప్పూటమాది।
కంపు వేసేటిచెయి ♦ గడియగడియకుమాది
హేయమేసేటిచెయి ♦ యేవేళమాది।
వట్టిచేఁపలకనీచు ♦ వాసించుచుండును
పచ్చిచేఁపలకంపు ♦ పరిఢవిల్లునుగా।
పందిపిల్లలు పెంచి ♦ బ్రతికేటివారిండ్ల
భిక్షుడుగుటకు నీకు ♦ ప్రియమెట్లు పుట్టె।
హితవుఎట్లాయెనో ♦ యీమర్మమంతయును
కానవచ్చెను మాదు ♦ కన్నులకు నేఁడు।
మటు మాయజంగాలు ♦ మాయవాదులుమీరు
మతములోపలి దొకటి ♦ మనసలేది యొకటి।

చిన్నపాపలుగలరు ♦ బెదురుదురు నినుఁజూచి
 రారాదు నీవంటి ♦ రవ్వజంగములు।
మరులుకొని తిరిగేరు ♦ మటు మాయజంగాలు
 మచ్చుమందులవారు ♦ మాయజంగాలు।
ఇది మొదలు రావద్దు ♦ ఈ వాడలో పలికి
 తిరిగిపోకుంటేను ♦ పరువుదీసెదము।
జాలరివీధికి ♦ సారెసారెకు నీవు
 పరుగెత్తివచ్చేవు ♦ పాటుదప్పేవు।
మరులుకొని నినుఁజూచి ♦ మాచిన్నపాపలు
 రట్టడి నీతోటి ♦ రాఁబోదురేమో।
పట్ణమంతట నీవు ♦ పట్టరాదాభిక్షు
 నిండదా నీకడుపు ♦ నిర్భాగ్యహరుఁడా।
వద్దన్నచోటికి ♦ వాదించివచ్చేవు
 చాలునీ వేలాటి ♦ జంగానవయ్యా।
నిలువకుండఁగనీవు ♦ తొలఁగిపొమ్మిచ్చోట
 మించనాడఁగఁబోవ ♦ మంచికాదయ్యా।
మాటపడివెళ్ళుటది ♦ మర్యాదగాదయ్యా
 యెంచి నీమదివిచా ♦ రించుకోవయ్యా।
అనియిట్లు చక్రమ్మ ♦ తనతోడఁబలికితే
 మాయజంగము పలికె ♦ మగువతోనపుడు।

జంగంబులనుగన్న ♦ సర్వజీవులుమీరు
తండ్రి భావంబుగాఁ ♦ దలఁచుకోవలెను।
అది మానిపోమ్మనుచు ♦ అల్లరులుచేసేవె
మించనాడుచునుపో ♦ మ్మంచు పలికేవు।
నెలఁతరో కోపింప ♦ నేనేమిచేసితిని
జంగమపద్ధతిని ♦ జను తెంచితిటకు।
కడుపే సముద్రమై ♦ కడులోకములనెల్ల
సంచరించఁగవలసె ♦ జంగమేశ్వరులు।
తిరుగుమని జంగముకు ♦ పరమేష్ఠి వ్రాసెను
సంచరించఁగవలసె ♦ జంగమేశ్వరులు।
సంచరించినవాఁడు ♦ జంగంబు నిజమౌను
చరియించ మరియాద ♦ జంగమేశులకు।
తప్పనాడకుతల్లి ♦ దయయుంచు నామీఁద
మరియాదదప్పిన ♦ మానవుఁడఁగాను।
నాతు లెవ్వారయిన ♦ ననుఁ జూచినచ్చుటకు
నాసొంపు పెంపేమి ♦ నాయందమేమి।
తన ముద్దరాలికే ♦ తగఁడనుచు పలికేరు
తిరుగుచున్నానిట్లు ♦ దేశదేశములు।
ఇఁకనువచ్చేవారు ♦ ఏమనుభవించేరు
మమ్ముజూచిననెట్లు ♦ మరులు కొనియెదరు।

రసములు డిగినయట్టి ♦ ముసలివాఁడను నేను
రూటిగల సతులయితె ♦ రోయకోనన్ను ।
మా వెంట నెందఱు ♦ మగువలు వస్తున్నారు
జోలెలోనెందఱు ♦ సుదతులున్నారు ।
జడలలోనెందఱు ♦ జలజాక్షులున్నారు
చంకలోనెందఱు ♦ సకియలున్నారు ।
పుక్కిటనెందఱు ♦ పూబోణులున్నారు
కరములోనెందఱు ♦ గరితలున్నారు ।
నాయాపు నారేఖ ♦ ననుఁజూచిపోలేక
మందయానలు నన్ను ♦ మరులుకొన్నారో ।
చూడవే నాతల్లి ♦ చూచి నిజమైతేను
కల్లపఱచవె నన్ను ♦ గట్టిగా నీవు ।
కొమ్మ చెప్పెద నాకు ♦ కొడుకు లిద్దఱుగలరు
పేసయిన యిద్దఱు ♦ పెండ్లాలుగలరు ।
పటిమశోభిలు ధన ♦ పతి నాకు నేస్తుండు
కొండమీఁదను ఇల్లు ♦ కొనసాగియుండు ।
కలరు ఇద్దరు మంచి ♦ ఘనమైనచుట్టాలు
శరధిఁజొచ్చినబావ ♦ మఱఁదొకఁడు గలఁడు ।
పడుచుతనమున నేను ♦ బ్రహ్మహత్య జేసితిని
బ్రహ్మహత్యదోషంబు ♦ పరిపూర్ణమయ్యె ।

బ్రహ్మహత్యదోషంబు ♦ పరిపూర్ణమయినాకు
బాల్లి దేహంబయ్యె ♦ పొలఁతిరో చూడు।
మేలైన అడివాకు ♦ మేనఁజరిమినఁగాని
పొలఁతిరో యీబాల్లి ♦ పోయినదికాదు।
పూనికుమ్మరబూడ్దె ♦ మేనఁజరిమినఁగాని
పొలఁతిరో యీబాల్లి ♦ పోయినదికాదు।
శరధితరచిననాఁటి ♦ గరళంబు మ్రింగినా
పొలఁతిరోయీబాల్లి ♦ పోయినదికాదు।
సకలదేశములందు ♦ సంచరించినఁగాని
పోదుపాపంబనుచు ♦ బుధులు చెప్పిరిగా।
బాల్లిదోషంబెల్ల ♦ పోవుటకు నేనిట్లు
సంచరించఁగవలసె ♦ జంగంబునగుచు।
ఇంతియేకాని నే ♦ నితరమెఱుఁగనివాఁడ
దూఱనాడకెతల్లి ♦ దోషినేఁగాను।
వనితనాతల్లినీ ♦ వాడలోకిఁకరాను
ప్రియముతో నీయింట ♦ భిక్షుడుగఁబోను।
అని యంతశంభుండు ♦ అచ్చోటువిడిచిచని
తనదుఎప్పటినిజ ♦ స్థళమునకుతర్లె।
తల్లిచెప్పినమాట ♦ తెల్లచెవులారవిని
తనగుండెఝల్లుమని ♦ తా గంగమాంబ।

తొలఁగిపొమ్మని హరుని ♦ తూలనాడినమాట
    తాసయిపఁజాలకను ♦ తల్లికిట్లనియె।
తగునఁటే నాతల్లి ♦ ధవళవర్ణుని నీవు
    నిలువకుండఁగనిపుడు ♦ తొలగించినావు।
నామీఁదప్రేమచే ♦ నన్నుఁజూచేకొఱకు
    పనిఁబూనివచ్చెను ♦ పలుమాఱుశివుఁడు।
అదరించి పొమ్మంటి ♦ వమ్మరో నాకోర్కె
    సమకూర్చుటెలాగు ♦ సరిచెప్పవమ్మ।
నీవుకోపించినా ♦ నీవిన్నితిట్టినా
    పార్వతీశ్వరునిపై ♦ భ్రమపాయదమ్మ।
అనియిట్లు శ్రీగంగ ♦ తనతోడఁబలుకంగ
    జగడమాడక వేగ ♦ చక్రమ్మపలికె।
శూలితోడఁతపొందు ♦ సుఖము లేదని నీకు
    మనసెంతవిఱిచినా ♦ మళ్ళవయితివిగా।
గట్టిగావద్దంటె ♦ కలికిరోనీమనసు
    అసురుసురుమనుచుండు ♦ నదియేలమాకు।
లోలాక్షి నేను ఈ ♦ లోకమర్యాదలను
    ఆడవలసినమాట ♦ లాడితినితల్లి।
నిజముగాశంకరుఁడు ♦ నీనాథుఁడయి తేను
    నిష్ఠురమేటికే ♦ నెలఁతరోమాకు।

ఏరునుబండియును ♦ ఏకముఖయుండేను
ఎంతేసిగట్లయిన ♦ ఎక్కిపోవచ్చు।
నీలకంఠునిఁబాయ ♦ జాలలేకుండేను
నిలుపనాశక్యమా ♦ నిన్నొక్కగడియ।
అంతటికి పితండ్రి ♦ అధికారియున్నాఁడు
అతనితోనీయొక్క ♦ అభిలాష చెప్పు।
నిను పెండ్లిసేయంగ ♦ నేనుకర్తనుగాను
కరమొప్పఅంతటికి ♦ కర్త పితండ్రి।
ముదిత చల్లకువచ్చి ♦ ముంత దాఁచఁగనేల
అడగవలసినమాట ♦ కనుమూనమేల।
నీబ్రదుకుతిన్ననకు ♦ నేనెంత చెప్పినా
వెలఁదిపట్టురోసపట్టు ♦ విడువవైతివిగా।
గట్టిగావద్దంటె ♦ కలికిరో నీమనసు
అసురుసురుమనుచుండు ♦ అదియేల మాకు।
జగముకంతటికెల్ల ♦ శంకరుఁడుదైవమని
యెఱుఁగుదుముపేదజీక ♦ మెన్నఁబనిలేదు।
కొలిచేటివారలకు ♦ కొంగుబంగారంబు
సందేహమింకలేదు ♦ సకియ నాతల్లి।
అల్లుఁడుగొపితండ్రి ♦ అతనితో పతఁజెప్పు
హరునితోకాపురం ♦ బతఁడుసమకూర్చు।

అనితల్లి పలుకంగ ♦ ఆమాటనిజమనుచు
తండ్రివద్దనునిలిచి ♦ తానిట్లుపలికె।
జాలరివంశాబ్ధి ♦ చంద్ర సుగుణాకర
నగభేదివైభవ ♦ ననుఁగన్నతండ్రి।
నిన్న పోయినరాత్రి ♦ నీలకంఠుఁడు వచ్చె
ప్రియముతో మనయింట ♦ భిక్షగైకొనెను।
భిక్షగైకొనితాను ♦ బెదరిపడ్డవిధాన
పరుగెత్తుకొనిపోయె ♦ పాడుగుళ్ళోకి।
తగనేఁటియుదయాన ♦ తప్పకుండఁగవచ్చి
భిక్షుడుగకోపమునఁ ♦ బిలిచినాతల్లి।
ఈవాడభిక్షముకు ♦ ఎపుడురావద్దనఁగ
మాఱుమాటాడకను ♦ మళ్లిపోయెనుగా।
పాడుగుళ్ళోఁజేరి ♦ పరమేశుఁడున్నాఁడు
అతఁడుజంగముగాఁడు ♦ అతఁడుశ్రీహరుఁడు।
నన్నుపెండ్లాడుటకు ♦ నామీఁదఆశతో
జంగమవేషమున ♦ చనుదెంచినాఁడు।
జాగుసేయక నన్ను ♦ శంకరునికర్పించి।
స్థిరమగుసత్కీర్తిఁ ♦ జెన్నారు తండ్రి।
కన్యాప్రదానంబు ♦ ఘనమయినదానంబు
అరయశివార్పితం ♦ బయినదానంబు।

నాగకేయూరునకు ♦ నను పెండ్లిగావించి
పుడమిలోసత్కీర్తిఁ ♦ బొందుమీతండ్రి।
అని ముద్దుకూఁతురు ♦ జనకుతోఁ బలుకంగ
సత్కృపావంతుఁడయి ♦ శంకుదేవయ్య।
బాల చెక్కిలిఁబట్టి ♦ పలుమాఱు ముద్దాడి
పలికె బాలికతోడ ♦ పరమహర్షమున।
నాగర్భరత్నమా ♦ నాతపఃఫలితమా
నాపెన్నిధానమా ♦ ననుఁగన్నతల్లి।
సామాన్యుఁడౌహరుఁడు ♦ సర్వలోకంబులకు
ఆధారనియుండు ♦ ఇదిదేవుండు।
భువనంబులొగ్గింప ♦ పుట్టింప రక్షింప
పరమబ్రహ్మస్వరూ ♦ పముగల్గువాఁడు।
మాఱువేషముచేత ♦ మనయూరుచొరనేల
పరికించిననుఁజూచి ♦ పారిపోనేల।
పాడుగుళ్ళోఁజేరి ♦ పడియుండఁగానేల
పరదేశివలె తాను ♦ తిరుగంగనేల।
దయనిండఁగా నాకు ♦ దర్శనంబియరాదో
బాలనర్పించుమని ♦ పలుకంగరాదో।
తానురాకుంటేను ♦ తగుపెద్దలను బంపి
అబలనర్పించుమని ♦ అడిగించలేఁడో।

సన్నసన్నఁగవచ్చి ♦ సన్నసన్నఁగఁబోవ
    తనకేమి అదిలెస్స ♦ కనుపించెనమ్మా।
నిజముగా జంగంబు ♦ నిటలాక్షుఁడయితేను
    దర్శనంబిచ్చునే ♦ తప్పకుండఁగను।
దర్శనంబియకుంటె ♦ తగువారలనుబంపి
    అబలనర్పించుమని ♦ అడిగించునమ్మా।
పరదేశివలె తాను ♦ పాడుగుళ్ళోనుంటె
    దేవుఁడని నేనెట్లు ♦ తెలియనమ్ముదును।
జాలర్లనందటిని ♦ ఏకీల నమ్మింతు
    ప్రియముతోనిన్నెట్లు ♦ పెండ్లిచేయుదును।
ఈమాట నిజముగా ♦ ఎవరితోఁజెప్పినా
    కాదనియంటురే ♦ ఘనతగాదమ్మా।
మహిమీఁదకొందఱు ♦ మాయవాదులు గలరు
    హరుఁడు నిక్కంబనుట ♦ అదియెట్లు గుఱుతు।
నాకు నమ్మకముగా ♦ నాగకంకణధరుఁడు
    నిజరూపుతోవస్తె ♦ నిను పెండ్లిసేతు।
హరుఁడు నిక్కంబన్న ♦ గుఱుతు తెలియక నిన్ను
    పరిణయముసేతునని ♦ పలుకంగలేను।

---

గంగాదేవి శివుని తనకు భర్తవగుమని ప్రార్థించుట

అని తండ్రిపలుకంగ ♦ ఆమాట కేమియును
మాఱుపలుకఁగ లేక ♦ మగువ తా నపుడు।
కరయుగంబులుమోడ్చి ♦ శిరముపైఁబెట్టుకొని
తగ సిలకంఠుపయి ♦ తన మనసు నిలిపి।
పడఁతి యేకధ్యాన ♦ పారీణయై మహా
నిటలాంతకుని మదిని ♦ నిల్పి యిట్లనియె।
శ్రీసదాశివ సర్వ ♦ జీవదయాకరా
దీనసంరక్షణ ♦ దేవాదిదేవ।
సర్వభూతాంతర ♦ సార మనోహర
నిగమాంతసంచార ♦ నిరుపమాకార।
భవహర సర్వేశ ♦ పరిపూర్ణ ధవళాంగ
పాపసంహార లింగ ♦ పరమాంతరంగా।
నీవు శంకరుఁడవని ♦ నేనెంత చెప్పినా
నాతండ్రి నిజముగా ♦ నమ్మఁడాయెనుగా।
నను పెండ్లియాడుటకుఁ ♦ జనుదెంచితివి నీవు
మాఱువేషముతోడ ♦ మసలంగనేల।
జగమెఱుంగని పెండ్లి ♦ సలుపుయత్నం బేల
నిజరూపుతో నీవు ♦ నిలువంగవలెను।

నిజరూపుతో నీవు ♦ నిలువకుండక పోతె
నమ్మఁజాలఁగ లేఁడు ♦ నాతండ్రి నిన్ను ।
దర్శనంబియకుంటె ♦ తగువారలను బంపి
పరిణయపు సంగతే ♦ ర్పఱపించు దేవ ।
నగుబాటుగాకుండ ♦ నాప్రతిన చెల్లించు
పుడమిలో నామాట ♦ బొంకుగాకుండ ।
జాగుసేయక సర్వ ♦ జనము లానందింప
సంతోషమున నీవె ♦ చనుదేర వలెను ।
అక్షీణ కరుణాక ♦ టాక్ష వీక్షణుఁడవు
మూఁడులోకంబులకు ♦ మూలకందుఁడవు ।
అని గంగపలుకంగ ♦ అంతరంగమునందు
కనికరహృదయుఁడయి ♦ గరళకంఠుండు ।
బాలపై కరుణించి ♦ పరిణయలోలుఁడై
పరమర్షివర్గముల ♦ భావమునఁదలఁచె ।

---

శివుఁడు సనకసనందనాదులను రప్పించుట

తలఁపు మదిలోనాటి ♦ తక్షణము వెడలిరి
పరమయోగీంద్రులు ♦ పయనంబులగుచు ।
సనకసనందన ♦ శాండిల్యమాండవ్య
శౌనక వాశిష్ఠ ♦ సన్మునీశ్వరులు ।

ఘనతమీఱంగ మా ♦ ర్కండేయ జమదగ్ని
కశ్యపాత్రేయాది ♦ ఘన మునీశ్వరులు ।
వాల్మీకి నారద ♦ వ్యాసగౌతమకణ్వ
కౌశికగార్గేయ ♦ ఘనమునీశ్వరులు ।
అలరుకంఠమున ప ♦ ద్మాక్షమాలికలతో
కేల జపమాలికలు ♦ వాలలాడుచును ।
కక్షపాలవిభూతి ♦ కమండలములతో
జడలు తూలాడంగ ♦ జనుదెంచిరపుడు ।
మునివరుల హర్షమున ♦ గని శంకుదేవుండు
వారి కుశలములడిగి ♦ గౌరవముచేసి ।
వేర్వేఱనందఱిని ♦ పిలిచి గద్దెలపయి
నుంచి మన్నించియో ♦ చించి యిట్లనియె ।
ఘనులార మునులార ♦ ఘనపుణ్యయుతులార
పరమపావనులార ♦ భవ్యాత్ములార ।
మిముఁగోరి పిలుచుటలు ♦ మీతోను వివరింతు
కార్యనిర్వాహకులు ♦ ఘనులు మీరంత ।
కళ్యాణపదమున ♦ గంగామహాదేవి
సకలలోకాధారి ♦ శాపమార్గమున ।
ఏలూరిపట్నమున ♦ జాలరియింటను
తళుకు బంగరుబొమ్మ ♦ వలె జన్మమొందె ।

కన్యకామణిని నే ♦ కళ్యాణమగుటకు
మనము నుద్దేశించి ♦ మఱి యిటకువస్తి ।
సకియ నిప్పించుమని ♦ శంకుదేవయ్యను
నే వెళ్లి పల్కుటకు ♦ నియతంబుగాదు ।
పనిఁబూని యేలూరు ♦ పట్నముకు మీ రేఁగి
వెలయంగ జాలరి ♦ వీధికే తెంచి ।
శంకుదేవయ్యకీ ♦ చందమంతయుఁ జెప్పి
రమ్యముగ నతనిమది ♦ రంజింపఁ జేసి ।
కన్యాప్రదానంబుఁ ♦ గావింపుమని చెప్పి
మహిమమీఱఁగ మళ్ళి ♦ మరలవలెనుండి ।
కొండలకొలఁదిగ ♦ వెండి బంగారంబు
కొదువలేకుండంగ ♦ కూర్చినాననుఁడీ ।
దివ్యాంబరంబులు ♦ దివ్యభూషణములు
కోటులర్బుదములు ♦ గూర్చినాననుఁడీ ।
తగుఫలాదులతోడ ♦ దర్శించి మీరంత
మఱిపెద్దలనుగూర్చి ♦ మాటాడిరండీ ।
పట్నంపుదేవి ఆ ♦ పార్వతిగలదంటె
అంతకు అధికార ♦ మాగంగదనుఁడి ।
వామభాగమున పా ♦ ర్వతిపాయదంటేను
తలమీఁద గంగను ♦ ధరియింతుననుఁడీ ।

అలంకారంబు లే ♦ నైనఁగోరినఁగాని
పరువులోభపుమాట ♦ పలుకఁబోకండి ।
పరికించిచూడ శు ♦ భస్యశీఘ్రంబనే
మాటమీరెఱుఁగుదురు ♦ మహనీయులార ।
పొరఁబోకకార్యములు ♦ పొసఁగించుకొనిరండి
సర్వజ్ఞులకు మీకు ♦ సరిచెప్ప నేల ।
మనసు రంజిల్లఁగా ♦ మధురవాక్యములాడి
అబలనిచ్చుట తథా ♦ స్తనిపించి రండి ।
మీరు సర్వజ్ఞులు ♦ మీకు జెప్పఁగఁజాల
పరిణయముగావించు ♦ భారమేమీది ।
తగుముహూర్తమున ప్ర ♦ ధానంబు చేసికొని
వెలయంగ భిక్షాన్న ♦ ములుచేసిరండీ ।
పొందుగను మీరా య ♦ రుంధతీదేవిని
తోడుకొనిపొండి తో ♦ డ్తోడ నేయిపుడు
చక్రమ్మమదిలోన ♦ సందేహములఁబాప
అంతఃపురికిఁబంపుఁ ♦ డాయరుంధతిని ।
అలంకారములచోట ♦ ననుమానపడకండి
ఏడువారాలనగ ♦ లిపుడు కొనిపొండీ ।
తల్లిదండ్రులనన్న ♦ దమ్ముల నెఱుంగను
ఎల్లబంధువులుమీ ♦ రే మాకుసుండీ ।

బొంకి గుడికట్టెది ♦ పుణ్యమని చెప్పిరి
తగు మీఋషీ మాట ♦ దక్కించుకొండీ।
వారిజాక్షులయందు ♦ వైవాహికములందు
ప్రాణరక్షణవిత్త ♦ మానభంగముల
గోబ్రాహ్మణులయందు ♦ కోరిబొంకినఁగాని
పాపమంటదు అనుచు ♦ పలుకు వేదములు।
ఈవైభవముకు మీ ♦ రేమిబొంకినఁగాని
మీకు పాపము లేదు ♦ మీకు పుణ్యంబు।
కరుణనాపయిఁబూని ♦ కడు వేగమీరేఁగి
కీర్తి దక్కించుకొను ♦ కర్తలేమీకు।
అని శంకరుఁడు పలుక ♦ ఆనందులై మునులు
శంకరుని వినుతించి ♦ సెలవుగైకొనిరి।
ఆ యరుంధతితోడ ♦ అఖిల మునిబృందములు
ఏలూరిపట్నంబు ♦ కేఁగిరవ్వేళ।
వాసిమీఱినయట్టి ♦ వైభవంబులతోడ
ప్రాకటంబుగ బ్రహ్మ ♦ లోకంబుఁబోలి।
కడువింతయైనట్టి ♦ కైలాసగిరిఁబోలి
పట్నంబు కళ్యాణ ♦ పదముగానుండె
ఆపట్టణముఁజొచ్చి ♦ ఆనందభరితులయి
కన్నులపండువు ♦ గా మునీశ్వరులు।

జాలరివీధులను ♦ జనుదెంచుచుండంగ
సద్వార్తలేవినెను ♦ శంకుదేవయ్య।
వారికెదురుగవచ్చి ♦ వందనంబులుచేసి
మునులందోడ్కొనిపోయి ♦ తనగృహంబునకు।
మేలయినయట్టిర ♦ త్నాలగద్దెలపయిని
కూర్చుండఁగాఁబెట్టి ♦ కుశలంబులడిగి।
అర్ఘ్యపాద్యాదివిధు ♦ లందు పూజయొనర్చి
పదసేవచేసెను ♦ భక్తిమీఱఁగను।
ఓమహాత్ములార ♦ ఓతపోధనులార
ఘనులారమునులార ♦ అనఘాత్ములార।
దివ్యలోకములందు ♦ తేజరిల్లెమీరు
వైకుంఠమందున ♦ వర్తించుమీరు।
ఏమిపుణ్యంబుమా ♦ కీవేళమీపాద
కమలముల్సేవింప ♦ గలుగుభాగ్యములు।
జన్మసాఫల్యంబు ♦ సమకూరెకోరికలు
పండెఁబలుభాగ్యములు ♦ నిండెనాయిల్లు।
మీరువచ్చుటశుభము ♦ మీరువచ్చుటజయము
మీరువచ్చుటమాకు ♦ మేలుసిద్ధించు।
వివరంబుగామీరు ♦ వేంచేయుసంగతులు
వినుటకైనామనసు ♦ వేడుకైయుండె।

అని శంకుదేవయ్య ♦ మునులతోఁబలుకంగ
    పరికిరిమునులు ఓ ♦ పల్లెకులజుండ।
శుభము లే తలఁచుకొని ♦ చూడవచ్చితిమయ్య
    నిజమేలగాకుండు ♦ నీనోటిమాట।
హరుఁడునీయల్లుండ ♦ నౌదుననుచున్నాఁడు
    పుడమిలోనీవెంత ♦ పుణ్యావంతుఁడవొ।
చెలువుమీఱఁగనీవు ♦ శ్రీగంగజనకుఁడవు
    నిజముగాశంభునికి ♦ నీవు మామవుగా।
ఎంచిచూడఁగనీవు ♦ ఎంతపుణ్యాత్ముఁడవో
    నీకుసరిమానవులు ♦ లోకమునలేరు।
కన్యాప్రదానంబుఁ ♦ గావింపుమనినిన్ను
    అడుగవచ్చితిమి మే ♦ మందఱముకూడి।
నీవుసర్వజ్ఞుఁడవు ♦ నీవెఱుఁగనిది లేదు
    తగినచోటికిబిడ్డ ♦ తగిలియ్యవలెను।
భాగ్యవంతుఁడు హరుఁడు ♦ పరిపూర్ణకాముండు
    ప్రాకటంబుగను ము ♦ ల్లోకరక్షకుఁడు।
అతనిఁగొల్చినవారి ♦ కతనుభాగ్యంబిచ్చు
    తగుభాగ్యసంపదలు ♦ తనకేమికొదువ।
వివరించియుండంగ ♦ వెండికొండతనిల్లు
    కొమరొప్పబంగారు ♦ కొండతనవిల్లు।

ధనపతికి బేరుండు ♦ తనకు చెలికాఁడౌను
అతనిసరివేల్పు లీ ♦ యవనిలో లేరు।
బాలనాతనికిచ్చి ♦ పరిణయముగావింపు
స్థిరమగు సత్కీర్తిఁ ♦ జెలఁగుదువు నీవు।
అనియిట్లుమునిగణము ♦ లతనితోఁ బలుకంగ
సన్మునులతోఁ బల్కె ♦ శంకుదేవయ్య।
పరగంగమీయాజ్ఞ ♦ శిరసావహించికొని
గరళకంఠునకు నా ♦ కన్యనిచ్చెదను।
తగినచోటికిబిడ్డ ♦ తగిలియ్యఁగావలెను
ఇచ్చెదనునాబిడ్డ ♦ నీశ్వరేశునకు।
అనిశంకుదేవయ్య ♦ మునులతోఁ బలుకంగ
అధికబ్రహ్మానందు ♦ లై వారలంత।
అంతకుముందుగా ♦ ఆయరుంధతిదేవి
అంతఃపురంబులో ♦ కరిగె వేగమున।
తూఁగుటుయ్యాలలోను ♦ నూఁగుగంగనుజూచి
తనకుమ్రొక్కంగ బా ♦ లను ముద్దుగొనెను।
కుదురుగాతొడలపైఁ ♦ గూర్చుండఁ బెట్టికొని
బాలనక్కున జేర్చి ♦ పడఁతియిట్లనియె।
చక్రమ్మకూఁతురయి ♦ జన్మిస్తివా నీవు
ఓతల్లి జగదంబ ♦ ఓగంగమాంబ।

నీలోనమునింగితే ♦ నిర్మాలమయిపోవు
అవనిలోపంచమ ♦ హాపాతకములు।
నిన్నుఁగనుఁగొనువారి ♦ నిఖిలపాపములుడిగి
ప్రాకటంబుగపుణ్య ♦ లోకములుగలుగు।
పానమొనరించంగ ♦ భవరోగహరణంబు
దివ్యస్వరూపమున ♦ తేజరిల్లెదవు।
శ్రీమహాదేవునకు ♦ చిన్నముద్దులభార్య
కానుంటివే నీవు ♦ ఘనమయినతల్లి।
పట్టంపుదేవివై ♦ భాసిల్లువేళలను
నినుఁజూడవత్తునే ♦ నెలఁతరోనేను।
నాఁటివలుత్తయిదువని ♦ ననుచేరవత్తువొ
వెళ్ళగొట్టింతువొ ♦ వినిపించవమ్మ।
అప్పటికిఇప్పుడే ♦ అమ్మరోనినుగట్టి
పఱచుకొంటేగాని ♦ బాగుగాదమ్మ।
అనిఅరుంధతిపలుక ♦ ఆగంగమాంబిక
చిఱునవ్వుమోమునను ♦ చెన్నుమీఱఁగను।
సర్వజనములకెల్ల ♦ జగములకంతటికి
నీవుముత్తయిదువవు ♦ నిజమునాతల్లి।
నినుజూడభాగ్యంబుఁ ♦ నిజముగాలభియించు
నినుఁజూడఁగాశుభము ♦ నిశ్చయముతల్లీ।

ధన్యులకుఁగాక నీ ♦ దర్శనము దొరుకదు
    దర్శనంబిచ్చుటకు ♦ దయవుంచుమమ్మా।
అనియిట్లుశ్రీగంగ ♦ తనతోడఁబలుకంగ
    ఆనందమునుబొందె ♦ ఆమౌనిపత్ని।
ఆనందమునుబొంది ♦ ఆయరుంధతిదేవి
    సరసఁగూర్చున్నట్టి ♦ చక్రమ్మఁజూచి।
సకియనక్కునఁజేర్చి ♦ సందిటనుబెట్టుకొని
    ఓయమ్మచక్రమ్మ ♦ ఓముద్దుగుమ్మ।
నీగర్భవాసమున ♦ శ్రీగంగబుట్టెను
    భామచక్రమ్మ నీ ♦ వేమినోచితివే।
నీలకంఠుఁడుహరుఁడు ♦ నీయల్లుఁడగుటకు
    పరమసంతోషమున ♦ బరఁగియున్నాఁడు।
హరునిభాగ్యము చెప్ప ♦ నలవిగాదే తల్లి
    ఈశ్వరుండున్న యా ♦ యిలు వెండికొండ।
వెలయచేఁ బట్టిన ♦ విల్లు బంగరుకొండ
    అలకుబేరుఁడుసఖుం ♦ డగుచునున్నాఁడు।
కొల్చేటివారలకు ♦ కొంగుబంగారంబు
    కామితార్థంబులకు ♦ ఘనకల్పతరువు।
కొనసాగియుండునే ♦ కొండలపొడవున
    వెండిబంగారంబు ♦ విలువలేకుండ।

తరుణినీవెన్నెవు ♦ హారునిపేదతికంబు
ఎవరుచెప్పిరినీకు ♦ ఈలాటిబుద్ధి।
కరకంఠునకునీదు ♦ కన్యకామణినిచ్చి
తగుకీర్తిబొందవలె ♦ జగములోపలను
వైశాఖశుద్ధవిది ♦ యీ సోమవారంబు
నేఁడుపుష్యమిమహా ♦ నేటయినరోజు।
తగుప్రధానపుముహూ ♦ ర్తము మహామంచిది
కన్యాప్రదానంబు ♦ గావింపవమ్మా।
హారునిపేదతికంబు ♦ మఱిమఱియుఁబలికేవు
నగలెన్నికావలెను ♦ తెగఁజెప్పవమ్మా।
ఈశ్వరుఁడుబంపినవి ♦ యివిప్రధానపునగలు
చూడముచ్చటనగలు ♦ చూడవేయమ్మ।

---

**అరుంధతి శివుడంపిన నగలను చక్రమ్మకిచ్చుట.**

చేర్చుక్కపాపట ♦ చేరులుగుమ్మటీల్
ఒకకోటివిలువవే ♦ సకియచూడుమిఁక
వజ్రాలుగలది యీ ♦ వన్నెము త్రెపునత్తు
అయిదులక్షలవిలువ ♦ అతివచూడుమిఁక
పౌజులుకమ్మలును ♦ బాజిబందులుశశి
పువ్వురాగిడి పదు ♦ మూడులక్షలవి।

ముత్యాలహారములు ♦ మోరీలపేరులు
వేయిలక్షలవిలువ ♦ వెలదిచూడుమిఁక ।
బంగారుమొలత్రాడు ♦ వరహాలమొలపేరు
ఇరువదివేలవి ♦ యింతిచూడుమిఁక ।
పాంజేబులునుకొమ్మ ♦ పసిఁడివడ్డాణంబు
పదివేలువిలువవి ♦ భామచూడుమిఁక ।
కాళ్ళమెట్టెలుచుట్లు ♦ పిల్లెళ్లుపావడాల్
పదినూర్లువిలువవి ♦ పడఁతిచూడుమిఁక ।
ప్రాకటముమీఁఅఁగ జ ♦ రీకుసుంబాచీరె
పదినూర్లువిలువది ♦ వనితచూడుమిఁక
ఇదిఒక్కరోజున ♦ కేయని తెచ్చితిమి
యింతియెక్కువనగలు ♦ ఇవికనులఁజూడు ।
ఏడువారంబులకు ♦ ఏడుతీరులనగలు
ఏర్పాటుగనుజూడు ♦ ఇదియొక్కమాట ।
ఆమాటచక్రమ్మ ♦ కందించెమునిపత్ని
మాటకన్నులఁజూచె ♦ ముదితచక్రమ్మ ।
అలంకారములమా ♦ టంతకన్నులఁజూచి
పొంగిమిన్నందెను ♦ పొలఁతిచక్రమ్మ ।
మాఱుమాటేమయిన ♦ నోరఁబలుకఁగలేక
తన బిడ్డనిచ్చుటకు ♦ అనుకూలపడెను ।

సతిపతులిద్దరు ♦ శంభుమహాదేవునకు
తన బిడ్డనిచ్చుటకు ♦ అనుకూలపడిరి ।
ముక్కంటి అంపిన ♦ మునులసంగతులెల్ల
జాలర్లకును జెప్పె ♦ శంకుదేవయ్య ।
శంకుదేవయ్యతో ♦ జాలరులందఱు
అబలనీశ్వరునకీ ♦ ననుకూలపడిరి ।

---

### శంకుఁదేవయ్య మునులకు విందుసేయుట

ఆనందభరితుఁడై ♦ ఆశంకుదేవయ్య
ఘనఫలాదులుగూర్చె ♦ మునులకందఱికి
కదళీఫలంబులును ♦ ఖర్జూరఫలములును
మాధుర్యకరమైన ♦ మాదీఫలములు ।
బదరీఫలంబులును ♦ పనసలు ద్రాక్షలు
నారింజఫలములు ♦ నారికేళములు ।
దానిమ్మఫలములు ♦ తగు జేమఫలములు
రమణీయకరమైన ♦ కమలాఫలములు ।
గురుతరంబైన పం ♦ పరమాసఫలములు
చాల మధురంబైన ♦ జంబూఫలములు ।
తేటమీఱినమంచి ♦ తీయదబ్బఫలాలు
శీతలం బొనరించు ♦ శీతాఫలములు ।

తేనె చక్కెర జున్ను ♦ పానకము మొదలయిన
మాధుర్యకరములౌ ♦ మధుపదార్థములు।
కోటులక్ష్యదములు ♦ గూర్చిన ద్రవ్యములు
బంగారుపళ్లెములఁ ♦ బట్టించినాఁడు।
బంగారుపళ్లెముల ♦ పట్టించుకొనివచ్చి
యెల్ల ఋషి సంఘముల ♦ కెదుటఁ బెట్టెనుగా।
ఘనఫలాదులఁజూచి ♦ మునులెల్ల వేడ్కపడి
సరగ గోదావరి ♦ స్నానములుచేసి।
పరమర్షివరులంత ♦ బంతులుగఁ గూర్చుండి
ఆరగింపులుచేసి ♦ రఖిల మునివరులు।
జిహ్వాచాపల్యంబు ♦ చెందిచ్ఛదీఱంగ
ఆరగింపులుచేసి ♦ రా పదార్థములు।
అంతఃపురంబులో ♦ ఆయరుంధతిదేవి
పసుపు కుంకుమబొట్టు ♦ బాల కమరించి।
తగుభూషణములెల్ల ♦ తరుణిమేనమర్చి
కాన్కదెచ్చినచీరెఁ ♦ గట్టఁబెట్టెనుగా।
చెలియ కీవిధముగా ♦ శృంగార మొనరించి
ఆరగించెఫలాదు ♦ లానందమునను।
పండ్లు ఫలాదులు ♦ పరితృప్తి భక్షించి
ఆయరుంధతిదేవి ♦ అఖిల మునివరులు।

తేనె చక్కెర జున్ను ♦ పానకము మొదలయిన
మాధుర్యకరములౌ ♦ మధుపదార్థములు ।
కోటులక్ష్యదములు ♦ కూర్చిన ద్రవ్యములు
బంగారుపళ్లెములఁ ♦ బట్టించినాఁడు ।
బంగారుపళ్లెముల ♦ పట్టించుకొనివచ్చి
యెల్ల ఋషి సంఘముల ♦ కెదుటఁ బెట్టెనుగా ।
ఘనఫలాదులఁజూచి ♦ మునులెల్ల వేడ్కపడి
సరగ గోదావరి ♦ స్నానములుచేసి ।
పరమర్షివరులంత ♦ బంతులుగఁ గూర్చుండి
ఆరగింపులుచేసి ♦ రఖిల మునివరులు ।
జిహ్వాచాపల్యంబు ♦ చెందిచ్ఛదీఱంగ
ఆరగింపులుచేసి ♦ రా పదార్థములు ।
అంతఃపురంబులో ♦ ఆయరుంధతిదేవి
పసుపు కుంకుమబొట్టు ♦ బాల కమరించి ।
తగుభూషణములెల్ల ♦ తరుణిమేనమర్చి
కానుకదెచ్చినచీరెఁ ♦ గట్టఁబెట్టెనుగా ।
చెలియ కీవిధముగా ♦ శృంగార మొనరించి
ఆరగించెఫలాదు ♦ లానందమునను ।
పండ్లు ఫలాదులు ♦ పరితృప్తి భక్షించి
ఆయరుంధతిదేవి ♦ అఖిల మునివరులు ।

చాల శృంగారించి ♦ మేలుగా వీధులను
　　భ్రమగొల్పు కనకకుం ♦ భములు పెట్టిరిగా।
గంధంబు కప్పురము ♦ కస్తూరి మొదలయిన
　　పరిమళ ద్రవ్యముల ♦ పురము నింపిరిగా।
మంగళపదముల ♦ మహితవాద్యంబుల
　　పురము నల్దెసల సం ♦ బరము చేసిరిగా।
ఎల్లదిక్కులయందు ♦ ఏకస్వరంబుగా
　　శంఖనాదంబులు ♦ చెలఁగఁజేసిరిగా।
శంకరునిదరికేగి ♦ సకలముని బృందములు
　　ఇచ్చోటి శుభవార్త ♦ తేర్పఱిచిరిగా।
ఆనందమునుబొంది ♦ అంబికానాధుండు
　　తడవేల పెండ్లికి ♦ తర్లుదామనెను।

---

##### శివుడు తనవివాహము నిమిత్తము హరిబ్రహ్మాదులను రప్పించుట

తర్లి వెళ్ళుదమనుచు ♦ తలఁచియొరులకుఁ జెప్పి
　　హరిని బ్రహ్మాదులను ♦ ఆత్మలోఁదలఁచె।
తలఁపుమదిలో నాటి ♦ తత్క్షణమువచ్చిరి
　　హరియు బ్రహ్మాదులు ♦ అమరాదిసురలు।
తగు విమానములతో ♦ తర్లి వచ్చిరివారు
　　ఎల్లసంతోషంబు ♦ లుల్లసిల్లఁగను।

ద్వాదశాదిత్యులును ♦ తగునవబ్రహ్మలును
అష్టదిక్పాలకులు ♦ అరుదెంచిరపుడు।
గరుడగంధర్వకి ♦ న్నరసిద్ధసాధ్యులును
అఖిలవిద్యాధరులు ♦ అరుదెంచిరపుడు।
భక్తిజోత్తిల్లంగ ♦ ప్రమథవర్గంబులును
కైలాసగిరినుండి ♦ కదలివచ్చిరిగా।
గంగావివాహంబు ♦ కనులఁజూతామనుచు
సత్యలోకమువారు ♦ చనుదెంచిరపుడు।
శ్రీదేవి భూదేవి ♦ చెలఁగునీలాదేవి
కూడివచ్చిరియెల్ల ♦ వేడుకలుమీఱ।
భారతీదేవియును ♦ వరరతీదేవియును
కూడివచ్చిరియెల్ల ♦ వేడుకలుమీఱ।
అమరనాథునిభార్య ♦ యయినట్టిశ్రీదేవి
అమరకాంతలుగూడి ♦ అరుదెంచిరపుడు।
శివునిపరిణయ మహో ♦ త్సవము కన్నులఁజూడ
ఛప్పన్నదేశాది ♦ జనులువచ్చిరిగా।
వారిసందడిఁజూచి ♦ వైభవముదీవించి
బసవేంద్రుపయినెక్కె ♦ పార్వతీశ్వరుఁడు।
సరిజోడుమీఱంగ ♦ గరుడవాహనమెక్కె
కమలనాభుఁడునడచె ♦ కరకంఠుతోడ।

హంసవాహనముతో ♦ ఆబ్రహ్మదేవుండు
కోరిహరిహరులను ♦ గూడినడచెనుగా ।
నమలివాహనముపై ♦ నను కుమారస్వామి
తనయెలుక తేజిత్తో ♦ గణనాయకుండు ।
చిలుకవాహనముతో ♦ చెన్నారుమన్మథుండు
ఐరావతంబుతో ♦ అమరనాయకుండు ।
అష్టిక ముకముప్పతిల ♦ అంబికేశునితోడ
కూడినడచిరియెల్ల ♦ వేడుకలుమీఱ ।
జయజయాభవయనుచు ♦ సకలమునిబృందములు
హరునిముందరనడిచి ♦ రతివినోదమున ।

---

శివుడుగంగను వివాహమాడుటకు తర్లివచ్చుట

నాట్యమ్ము సేయుచును ♦ నడచెభృంగీశ్వరుండు
అందఱికిముందుగా ♦ ఆనందుడగుచు ।
ఢంకా నగారాల ♦ ఢమఢమధ్వనివెలసె
తమ్మటధ్వానులచే ♦ ధరణిభేదిల్లె ।
ఘుమ్ముఘుమ్మునవీర ♦ కాహళులుచెలరేగె
భేరీమృదంగములు ♦ భోరటిల్లెనుగా ।
వందిమాగధులుకై ♦ వారములు సలిపిరి
పంచమహావాద్యములు ♦ మించిమ్రోగెనుగా ।

జయమంగళం సర్వ ♦ జను లెల్ల వేంచేయ
వారకాంతలు మేజు ♦ వాణేలు సేయ ।
పండువెన్నెలపట్టు ♦ పగలుగాఁగాయంగ
తరలివచ్చెను శూల ♦ ధరుఁడు వేడుకను ।
శృంగారకన్నియలు ♦ మంగళంబులు పాడ
తరలివచ్చెను శూల ♦ ధరుఁడు వేడుకను ।
శారదయు మహాలక్ష్మి ♦ సైన్యమును చల్లంగ
నందీశు పై నెక్కి ♦ నడచె శంభుండు
నేటయిన దివిటీలు ♦ కోటిలక్షలు వెలుఁగ
నందీశు పై నెక్కి ♦ నడచె శంభుండు ।
పట్టుపగలుగ మతా ♦ బాలు రంజిల్లంగ
నందీశు పయి నెక్కి ♦ నడచె శంభుండు ।
ఆ రంభ యూర్వశి ♦ అప్సరస్త్రీ లెల్ల
నాట్యమ్ము సేయంగ ♦ నడచె శంభుండు ।
చదలంటఁగా నెగసె ♦ సత్యలోకపుఘూళి
మొగిరె తారాచువ్వ ♦ లేమి చెప్పుదును ।
జగములన్నిటికెల్ల ♦ చండప్రకారముగ
లక్షకోటులుగాలె ♦ లంకాపురీలు ।
అరుదుగాగొట్టంబు ♦ లర్బుదంబులుగాలె
చిచ్చుబుడ్లేగాలె ♦ హెచ్చుగాకోట్లు ।

కొమ్ముబాణపుసంచు ♦ కోట్లులక్షలుగాలె
చక్రబాణపుసంచు ♦ శతలక్షగాలె।
పలుపలుతంపాల ♦ బాణసంచులుగాలె
మిన్నుకంటేపొడవు ♦ మిక్కుటంబుగను।
ఇట్లు సంభ్రమముతో ♦ ఎల్లవేడుకలతో
పలూరిపురవీధి ♦ కేతెంచిరపుడు।
ఎదురుమేళములతో ♦ ఏకసంభ్రమముతో
శివుని కెదురుగవచ్చి ♦ శంకుదేవయ్య।
పరగబుక్కాగుండ ♦ బాగుగాఁబట్టుకొని
వేటలాడిరిచెప్ప ♦ చోటులేకుండ।
వారువీరునుకొంత ♦ వాదమాడినరీతి
అతిసంభ్రమముచేసి ♦ రచ్చోటనిలిచి।
పట్టణస్త్రీలెల్ల ♦ పార్వతీనాథునకు
నివ్వాళులేపట్టి ♦ నిలిచియుండిరిగా।
జాలరి స్త్రీలెల్ల ♦ శంకరుని కెదురుగా
నివ్వాళులేపట్టి ♦ నిలిచియుండిరిగా।
నివ్వాళికాంతలకు ♦ నీలకంఠుండిచ్చె
తబుకుతబుకున వరహా ♦ తప్పకుండగను।
ఆరీతిసంభ్రమము ♦ అధికముగఁ జేయుచును
తర్లివచ్చిరిచెప్ప ♦ తరముగాకుండ।

బంగారు పళ్లెముల ♦ బాగైన వస్తువులు
    కంత దెచ్చిరి దేవ ♦ కాంతలందఱును ।
తీరైన పెండ్లిపం ♦ దిటిలోన నిలిచిరి
    తగువిమానములతో ♦ తనివిమీఱుచును ।
చిఱునవ్వు మోముతో ♦ శ్రీమహాదేవుండు
    రంజిల్లు వృషభతు ♦ రగము దిగియెచుగా ।
తమవాహనంబులం ♦ దఱు డిగ్గి నిలిచిరి
    హరిహరాములు బ్రహ్మ ♦ అమరనాయకుఁడు ।
పసిఁడిపావలమీఁద ♦ పార్వతీనాథుండు
    నిలిచి కేల్పట్టుకొని ♦ జలజాక్షుతోడ ।
తోడుమీఱఁగ తమ్మి ♦ చూలి తమతోనడువ
    వెల్లరుగుపయిఁ జేరి ♦ పీటపయినుండె ।
నవరత్నఖచితమై ♦ నట్టిబంగరుపెండ్లి
    పీటపైఁ గూర్చుండె ♦ నేటుగా హరుఁడు ।
సరిగాను గూర్చుండె ♦ జలజనేత్రుఁడు బ్రహ్మ
    తక్కిన వార లం ♦ దఱును గూర్చుండ్రి ।
ముక్కోటిదేవతలు ♦ ముల్లోకములవారు
    ఆపయిని గూర్చుండ్రి ♦ అన్ని దిక్కులను ।
వారకాంతలు మేజు ♦ వాణీలు చేసిరి
    బొమ్మలాడినరీతి ♦ పొలుపుమీఱుచును ।

ఆటపాట వినోద ♦ మంత యాలింపుచును
ముగ్గురు వేల్పులోక ♦ మూలఁగూర్చుండ్రి।
దేవకాంతలువచ్చి ♦ దేవాదిదేవునకు।
సొగసు శోభిల్లఁగ ♦ నగలు పెట్టిరిగా।
పసిడికొండలతోడ ♦ పన్నీరుగొని తెచ్చి
జలకమార్చిరికొంద ♦ ఱలివేణులపుడు।
శుభవస్త్రములతోడ ♦ సూర్యకులవరులెల్ల
తడియొత్తిరికొందఱు ♦ ధవళలోచనలు।
కర్పూరగంధంబు ♦ గలిపి మైనిండలఁది
తిలుకంబువెట్టిరి ♦ దేవదేవునకు।
శృంగారకరమైన ♦ గంగాభవానికి
జలజలోచనయొకతె ♦ నలుగుపెట్టెనుగా।
కనక ఘటంబుతో ♦ కలికి యుదకముదెచ్చె
జలజలోచనయొకతె ♦ జలకమార్చెనుగా।
తన మడుపువస్త్రంబు ♦ తనచేతఁ బట్టుకొని
తరుణిపన్నీర్ చల్ల ♦ తడియొత్తెనొకతె।
పసిఁడివన్నె మెఱుంగు ♦ పట్టుపీతాంబరము
కాంతామణియొకర్తె ♦ కట్టఁబెట్టెనుగా।
నవరత్నములభూష ♦ ణములు మేన నమర్చి
కలికియొక్కతెనుదుట ♦ తిలకముంచెనుగా।

కురులున్న గదువ్వి ♦ కొమరొప్పఁగాముడిచి
చెలియయొక్క తెవిరులు ♦ సిగనుజుట్టెనుగా
ఇట్లు శృంగారించి ♦ యింతి నటుతోడుకొని
పోయి గౌరీదేవి ♦ పూజలోనిడిరి।
పూజలోఁగూర్చున్న ♦ పువుబోణినప్పుడు
ఆయరుంధతిదేవి ♦ కప్పగించిరిగా।
అప్పగించినబాల ♦ నపుడెత్తుకొని పెండ్లి
పీటకు ప్రదక్షిణము ♦ పెట్టె ముమ్మాఱు।
ప్రేమతో శంకరుని ♦ వామభాగంబున
బాలతోఁగూర్చుండె ♦ పరమమునిపత్ని।
బ్రహ్మదేవుండపుడు ♦ పౌరోహితుండగుచు
గణపతిని పూజించె ♦ ఘనము మీఱఁగను।

---

### గంగావివాహ ఘట్టము.

శ్రీమహాదేవునకు ♦ శ్రీగంగమాంబికకు
కంకణంబులుగట్టె ♦ కరపల్లవముల।
శంకుదేవయ్యయును ♦ చక్రమ్మయునుగూడి
బంగారుతబుకులో ♦ పన్నీరుతెచ్చి।
భక్తితో శంకరుని పాదాబ్జములుకడిగి
పోసఁగకన్యనుధార ♦ పోసిరవ్వేళ।

కలితసాలంకృత ♦ కన్యాప్రదానంబు
హరుని కర్పించిరి ♦ ఆవధూవరులు।
ఘనముగా నిద్దఱికి ♦ కంకణంబులుగట్టి
పాణిఁబట్టించెనా ♦ బ్రహ్మదేవుండు।
పసిఁడిజన్నిదము లే ♦ ర్పడఁగ హరునకు వేసి
ఘనముగా వేదమా ♦ ర్గప్రకారమున।
వేదపారము లెల్ల ♦ విప్రవర్యులు చదువ
మహిమతో శాస్త్రధ ♦ ర్మప్రకారమున।
మంగళమస్తు శుభ ♦ మంగళం బనుచును
బ్రాహ్మణోత్తములెల్ల ♦ పలుకుచుండఁగను।
చిఱునవ్వు నవ్వుచును ♦ శ్రీమహాదేవుండు
పాలఁతికప్పుడు తాళి ♦ బొట్టు గట్టెనుగా।
తాళిబొట్టమరించి ♦ తరువాత శంభుండు
ముల్లోకములవారు ♦ మోదంబునొంద।
మహిమశోభిల్లంగ ♦ మధుపర్కములుగట్టి
కోటిసూర్యులభంగి ♦ నేటుమీఱుచును।
చారుమంగళసూత్ర ♦ ధారణంబొనరించె
శ్రీగంగ కంఠమున ♦ చంద్రశేఖరుఁడు।
అఖిలబంధములెల్ల ♦ నడఁగించు గంగను
బంధించె పోగుచే ♦ పార్వతీశ్వరుఁడు।

పదునాల్గు లోకముల ♦ పొర్షిమీఱినగంగ
తనరంగ నూలుపో ♦ గునఁ గట్టఁబడెను ।
తరువాత నావధూ ♦ వరులు గూర్చుండఁగ
వేడుకల్ దీవనలు ♦ చేడెలందఱును ।
తలఁబ్రాలుమున్నిళ్ళ ♦ తబుకులోఁగొని తెచ్చి
తలఁబ్రాలుద్రిప్పిరా ♦ దంపతులపైన ।
హరునిపై శ్రీగంగ ♦ అతివపై శ్రీహరుఁడు
మచ్చరింపుచుఁజల్లి ♦ రెచ్చుమీఱఁగను ।
కురులపై ముత్యాలు ♦ సరులునిల్పినలాగు
కొమరొప్ప తలఁబ్రాలు ♦ కుమ్మరించిరిగా ।
మనచెయ్యిమీఁదాయె ♦ మనచెయ్యిమీఁదాయె
ననుచు నిరువంకవా ♦ రనుకొనిరియపుడు ।
ఆవధూవరుల పు ♦ ట్టాల కొంగులఁబట్టి
బ్రహ్మముళ్లను వేసె ♦ పరమేష్ఠి అపుడు ।
ఆవధూవరుల ముం ♦ దర హోమములఁ జేసి
రపుడు బ్రహ్మాది దే ♦ వాది దేవతలు ।
బంగారు మొలత్రాడు ♦ పట్టువస్త్రము దెచ్చి
తెరవేసిరా వధూ ♦ వరుల మధ్యమున ।
అందియల్ ఘల్లుఘు ♦ ల్లని మ్రోయఁగా సప్త
పాదములు దొక్కించి ♦ రా దేవసతులు ।

దంపతుల కిద్దఱికి ♦ తగుశాస్త్ర ధర్మమున
హితవుగా నలయరుం ♦ ధతిని జూపిరిగా।
మోదముతో ఫలదాన ♦ ముల వేడ్కఁ జేసిరిగ
ఇరువంకవారొక్క ♦ తెఱఁగునను గూడి।
ఆపెండ్లి వైభవం ♦ బపుడు కన్నులఁ జూచి
ముల్లోకముల వారు ♦ ముదమునొందిరిగా।
ఆనందభరితుఁడై ♦ ఆశంకరుదేవయ్య
చదివించె కట్నములు ♦ శంక లేకుండ।
పదిలక్ష పదికోట్లు ♦ మదగజంబులు దెచ్చి
అరణంబు చదివించె ♦ సంబికేశునకు।
వేయిలక్ష వేయికోట్లు ♦ వింతతురగంబులను
అరణంబు చదివించె ♦ నంబికేశునకు।
ముదముతో డుతకోటి ♦ రథసమూహంబులను
అరణంబు చదివించె ♦ అంబికేశునకు।
అర్బుదము నిర్బుదము ♦ లధికగోబృందములు
అరణంబు చదివించె ♦ అంబికేశునకు।
అప్సరసలర్బుదము ♦ అర్బుదము దాసీలు
అరణంబు చదివించె ♦ అంబికేశునకు।
తనయింటఁగలయట్టి ♦ ఘనరత్నవస్తువులు
అరణంబు చదివించె ♦ అంబికేశునకు।

హరికి బ్రహ్మాదులకు ♦ అమరాదిసురలకు
చదివించెకట్నములు ♦ శంక లేకుండ।
అపుడు పేరంటాళ్ళు ♦ ఆదంపతులపైన
వైభోగములపాట ♦ వరుసఁ బాడిరిగా।
శ్రీయిందిరాదేవి ♦ శ్రీవిష్ణుసరిఁబోలి
అలరుతామరతంప ♦ రై యుండవలెను।

**దేవతాంగనలు వధూవరులకు పాటలుపాడుట.**

విరితావియొకరీతి ♦ వెలయుచందంబున
ఈదంపతులుమహి ♦ నింపొందవలెను।
తీఱుఁమీఱఁగపూల ♦ చేరెత్తినట్లుగా
కలికిమాగంగమ్మ ♦ కాపురము వెలయు।
కాంతమాశ్రీగంగ ♦ గర్భంబుచల్లంగ
కొడుకులకోటరై ♦ కొనసాగవలెను।
ధరణిలో తగిన చుట్ట ♦ రికంబులందుకొని
కలకాలభాగ్యంబు ♦ గలుగంగవలెను।
కడుపారగాసుతులఁ ♦ గాంచిమాశ్రీగంగ
వరపార్వతీరీతి ♦ వర్ధిల్లవలెను।
నెలఁతలుకొందఱు ♦ నివ్వాళులేపట్టి
పాడిరినివ్వాళి ♦ పాటలవ్వేళ।

శ్రీమహాదేవవ ♦ ర్ణిత నీకు నివ్వాళి
నిగమోక్తనిర్ఘోష ♦ నీకు నివ్వాళి ।
కరుణాలవాలశం ♦ కర నీకు నివ్వాళి
నిత్యమంగళరూప ♦ నీకు నివ్వాళి ।
శ్రితపాల శ్రీసదా ♦ శివ నీకు నివ్వాళి
నిగమగోచరవంద్య ♦ నీకు నివ్వాళి ।
నతభక్తలోకవం ♦ దిత నీకు నివ్వాళి
నిఖిలలోకాధీశ ♦ నీకు నివ్వాళి ।
దురితాంధకారిసం ♦ హార నీకు నివ్వాళి
నిటలాక్షసర్వేశ ♦ నీకు నివ్వాళి ।
మగువలుకొందఱు ♦ మంగళంబులుపాడి
రపుడుసర్వేశ్వరున ♦ కర్పితంబనుచు ।
మంగళముశతకోటి ♦ మార్తాండతేజునకు
మంగళముసత్పరమ ♦ మానివంద్యునకు ।
మంగళమువృషరాట్టు ♦ రంగసంచారునకు
మంగళముఖగరాట్టు ♦ రంగవినుతునకు ।
పురుహూతవంద్యునకు ♦ భూతగణనాథునకు
ఉరగకేయూరునకు ♦ ఉత్తమాంగునకు ।
కరుణావిశాలునకు ♦ ఘనపుణ్యాచరితునకు
శరధిగంభీరునకు ♦ శర్వాణీపతికి ।

పార్వతీనాథునకు ♦ భవ్యప్రతాపునకు
నిఖిలభువనేశునకు ♦ నివ్వాళులివిగో ।
గీర్వాణవినుతునకు ♦ కీర్తివిస్తారునకు
సర్వజనములఁ బ్రోచు ♦ జగదీశునకును ।
త్రిపురసంహారునకు ♦ దేవాదిదేవునకు
కపటనాటకసూత్ర ♦ కారుణునకును ।
సూర్యశతకోటి తే ♦ జోపరమనందునకు
కూర్మిజగములఁ బ్రోచు ♦ గుణగణ్యునకును ।
విగతభవపాశునకు ♦ వేదాంతవేద్యునకు
నగనాథధన్యునకు ♦ నందికేశునకు ।
నిగమసంచారునకు ♦ నిత్యకళ్యాణునకు
నగభేదివంద్యునకు ♦ నాగకంకణుకు ।
కాయజాతునితల్లి ♦ కాంతముద్దులగుమ్మ
తోయజాక్షునిగొన్న ♦ దొడ్డయిల్లాలు ।
అయిదువతనము భా ♦ గ్యంబుదీర్ఘాయువు
ఎలమితో మాగంగ ♦ కిచ్చిప్రోచునుగా ।
అనియిట్లు దేవతాం ♦ గనలు పాటలుపాడ
ఆనందభరితులయి ♦ అయముదీయుచును ।
పెండ్లివారందఱికి ♦ పెండ్లిభోజనములు
గావించుటకుఁదలఁచె ♦ దేవేంద్రుఁడపుడు ।

దివ్యముగ తనకామ ♦ ధేనువునుదెప్పించి
    వెలయభోజనపాక ♦ విధిగూర్పుమనెను।

---

దేవేంద్రుఁడు తనకామధేనువుతో భోజనపదార్థముల నమర్చుమని చెప్పుట.

ఇదియెంతపనియనుచు ♦ నెల్ల వేడుకతోడ
    వెలయపందిళ్ళలో ♦ నిలిచివెల్లావు।
హరిహరబ్రహ్మలు ♦ అమరాదిదేవతలు
    బంతులేసాగిరా ♦ పందిళ్ళలోను।
గరుడగంధర్వకి ♦ న్నర సిద్ధసాధ్యులు
    బంతులేసాగిరా ♦ పందిళ్ళలోను
ప్రకటముగఁబల్లిత్రోం ♦ బదివేలఅయ్యలు
    బంతులేసాగిరా ♦ పందిళ్ళలోను।
ముల్లోకములఁగలుగు ♦ ఎల్ల వారందఱును
    బంతులేసాగిరా ♦ పందిళ్ళలోను।
అన్ని బంతులనడుమ ♦ ఆవేలుపులగిడ్డి
    నిలిచిసంతోషమునఁ ♦ బలికె సిరిరి।
పందిళ్ళునిండంగ ♦ బంతులే సాగిరి
    వినుఁడు నేనొకమాట ♦ విన్నవించెదను।
ఈవేల్పు మొదవు మా ♦ కేమి యిచ్చేనంచు
    చులకఁదనమున నన్నుఁ ♦ జూడకుఁడి మీరు।

ఘనపదార్థములేమి ♦ కావలెనో కోరుండి
    కోరికలు మీకు సమ ♦ కూరును నీవేళ।
అనిపల్కి వేగమున ♦ అన్నిబంతులనడుమ
    చోద్యమొందఁగ నడువఁ ♦ జొచ్చె వెల్లావు।
వెల్లావు నడువంగ ♦ వెంటనే సిద్ధించె
    ఘనఫలంబులు నెల్ల ♦ కామితార్థములు।
బూరెలును శర్కరయు ♦ పోతట్లు గారెలు
    అరిసెలు ఒబ్బట్లు ♦ అప్పడాల్ మొదలు।
పరమాన్నమును మంచి ♦ పానకాల్ పెరుగులును
    జున్ను పోకులు పాల ♦ జున్నుతిమ్మనము।
చంద్రకాంతలు కండ ♦ చక్కెరల్ మీఁగడ
    పన్నీరులడ్డులును ♦ వెన్న అప్పాలు।
చాయపప్పులు మంచి ♦ చలువన్నములు మేలు
    కాయగూరలు జార్లు ♦ కలగాయపులుసు।
దప్పళంబులు తావి ♦ దనరుపాకంబులు
    ఊరుఁగాయలు రుచులు ♦ ఊరుఁబచ్చళ్ళు।
పాలు పెరుగును నెయ్యి ♦ మేలు నవనీతంబు
    తేనె శర్కరజున్ను ♦ తియ్యరఁటిపండ్లు।
కమలాఫలంబులు ♦ ఖర్జూరఫలములు
    మాధుర్యకరమైన ♦ మామిడీఫలములు।

చాల మధురంబైన ♦ జంబూఫలంబులు

వాసిమైనట్టి వం ♦ పరమానపంక్తు ।

పనసజంబుద్రాక్ష ♦ బదరికాఫలములు

అపరంజి పళ్లెమున ♦ నమరియుండెను**గా** ।

కోరినపదార్థములు ♦ కొఱంత లేకుండంగ

కలిగె జనములకెల్ల ♦ కావలసినట్లు ।

జిహ్వాచాపల్యంబుఁ ♦ జెందఁగానందఱు

ఆరగింపులుచేసి ♦ రాపదార్థములు ।

శ్రీదేవి భూదేవి ♦ చెలఁగు నీలాదేవి

తీరుగా భారతీ ♦ దేవి శచీదేవి ।

దేవతాకాంతలు ♦ తెఱవను లందఱుగూడి

అంతఃపురంబులో ♦ నారగించిరిగా ।

కమనీయ జలములను ♦ కరములు గడిగిరి

విమలకర్పూరవీ ♦ డ్యములు చేసిరిగా ।

ఆనాల్గుదినము ల ♦ త్యానంద మార్గమున

సర్వదేవతలుండ్రి ♦ జాలరునియింట ।

వేళతప్పకయుండ ♦ పింతభోజనములును

సరససల్లాపములు ♦ సలుపుచుండిరిగా ।

చెలఁగి యైదవనాఁడు ♦ శేషహోమముచేసి

శాస్త్రప్రకారమునఁ ♦ జనుదెంచిరంత ।

దేవతాంగనలు కొట్నములు దంచుట.

---

కొమ్మలందఱు పెండ్లి ♦ కొట్నములు దంచుటకు
వేర్వేఱు పరసతులఁ ♦ బిలువఁ దొడఁగిరిగా।
పచ్చికస్తూరి రావె ♦ భావజునిసతి రావె
కుదురైన పన్నీటి ♦ కుప్పి నీవు రావె।
కలికి చిలుకలకొలికి ♦ కాయజునిపూములికి
చెలియ ముద్దులగుమ్మ ♦ చేడె రావమ్మ।
కరియాన నీవురావె ♦ కనకాంగి నీవు రావె
వన్నెమీఱిన పొన్న ♦ గున్న నీవురావె।
చిఱుబోణి నీవు రావె ♦ సురపొన్న నీవురావె
పరమమధురపుపండ్ల ♦ పనస నీవురావె।
కావేరి నీవురావె ♦ కస్తూరి నీవురావె
పొలుపైన బంగారు ♦ బొమ్మ నీవురావె।
సువ్వీసువ్వీసువ్వి ♦ సువ్వాల్ల సువ్వన్న
యనుచు దంచిరి కొట్న ♦ మప్రబకన్నియలు।
గరుడవాహనములును ♦ గౌరిహుంకరములును
నెరవైన పచ్చగ ♦ న్నెరు రత్నసరులు।
మహారాజభోగములు ♦ మంగసరిధాన్యములు
బయిహోండా మంచి ♦ పాలకిన్నరులు।

సువ్విసువ్విసువ్వి ♦ సువ్వాల్ల సువ్వన్న
యనుచు దంచిరి కొట్న ♦ ముబ్రకన్నియలు ।
చెలువైన తులశెట్లు ♦ చిట్టిముత్యమ్ములు
ఎలమిమీాజినయట్టి ♦ యస్త్రిసన్నములు ।
ప్రయాగధాన్యములు ♦ పరగులంకాణములు
శ్రీరామభోగములు ♦ చిట్టికన్నియలు ।
పసపుకుంటియలు సాం ♦ పగు మంచిభోగములు
కార్తీకములు మంచి ♦ కాకిసన్నములు ।
సువ్విసువ్విసువ్వి ♦ సువ్వాల్లసువ్వన్న
యనుచు దంచిరి కొట్న ♦ ముబ్రకన్నియలు ।
కలకూర్చి చెలులెల్ల ♦ కంకణధ్వని వెలయ
అందియలు ఘులుఘుల్లు ♦ మన దంచిరపుడు ।

---

వసంతములాడుట.

కొట్నములు చాలించి ♦ కొమ్మలందఱు గూడి
అలరు వసంతంబు ♦ లాడిర వ్వేళ ।
చెలువైన బంగారు ♦ చిమ్మనగ్రోవితో
చిమ్ములాడుచు వసం ♦ తమ్ములాడిరిగా ।
కుంకుమగుండ బ ♦ గ్గుండ కర్పూరంబు
మొల్లముగ చేబట్టి ♦ చల్లులాడిరిగా ।

పన్నీరు జవ్వాది ♦ పచ్చికస్తూరియుచు
ఉల్లాసములుమీఱి ♦ చల్లులాడిరిగా।
మల్లెలును మొల్లలును ♦ మొల్లంగి గొజ్జంగి
మొల్లముగ చేఁబట్టి ♦ చల్లులాడిరిగా।
అట్లు వసంతంబు ♦ లాడి యావేళ తమ
విడిదికరుదెంచిర ♦ య్యెడపెండ్లివారు।

---

చక్రమ్మ శంకుదేవయ్యలు కొమార్తెను శివునకు ఒప్పగింతపెట్టుట.

తమబిడ్డ నప్పగిం ♦ తలు పెట్టుటకుఁదలఁచి
జాలరి చక్రమ్మ ♦ శంకుదేవయ్య।
కన్నీరు పెట్టుచును ♦ కడుజాలిఁబొందుచును
బాల నెత్తుకవచ్చి ♦ పల్కె రీ గతిని।
శ్రీమహాదేవ రా ♦ జీవాక్షసన్నుతా
లోకనాయక సర్వ ♦ లోకరక్షకుఁడా।
వలూరిపట్నమున ♦ జాలర్లు అందఱును
పావనంబైరి నీ ♦ పదదర్శనమున।
కామినీరత్నంబుఁ ♦ గైకొమ్ము నీసొమ్ము
అనుచు దగ్గరవచ్చి ♦ యావధూవరులు।
శ్రీకంఠు చెయిపట్టి ♦ చెన్నారుచును వారు
పలికిరప్పుడుపరమ ♦ భక్తితో నిలిచి।

మాతండ్రి పరమేశ ♦ మమ్ము రక్షింపుమా
అల్లుండవైతి మా ♦ యధికభాగ్యమున ।
తొల్లింటి మానిజా ♦ స్తోమములుపండెను
నిండార భాగ్యములు ♦ నేఁడు సమకూరె ।
కోటినోములు నోఁచి ♦ కోటితపములు చేసి
అరుదుగఁగంటిమీ ♦ యమ్మనొక్కతెను ।
అర్పించితిమి మీకు ♦ అబల నీసొమ్ముగా
చేపట్టి రక్షించు ♦ శివమహాదేవ ।
పసిబాల యీగోల ♦ పనులేమెఱుంగదు
దినదినంబున నీవు ♦ దిద్దుకోవలెను ।
ఇన్ని దినముల దాఁక ♦ కన్నవారము మేము
వెలఁది కిటమీఁద నీ ♦ వే సమస్తంబు ।
అత్తవారింట భా ♦ గ్యంబెంతకలిగిన
మొదటి పుట్టింటాస ♦ వదలదింతులకు ।
గగనముపొడుగు తన ♦ కాపురంబుండిన
మొదటి పుట్టింటాస ♦ వదలదింతులకు ।
మఱుఁగునైనను మారు ♦ మాటాడనేరని
కాంతను నీవెట్లు ♦ కరుణఁజూచెదవొ ।
బాలికనురక్షించు ♦ లాలించి ప్రోవుము
చాలచెప్పఁగనేల ♦ బాల నీసొమ్ము ।

పరమార్థ నిజముగా ♦ పగవారికైనను
ఆడుసంతానంబు ♦ కూడదెవ్వరికి ।
చాలచెప్పఁగనేల ♦ సకియ గౌరమ్మతో
సాటిగాఁజూడు మీ ♦ సాంబశివ నీవు ।
చేడెమాబిడ్డయని ♦ చెప్పవ స్తిమిగాని
ఎల్లభారంబు నీ ♦ దే మహాదేవ ।
తప్పువచ్చినవేళ ♦ తాల్మిపడి రక్షించు
కోపగించకు చిన్న ♦ గోల యీబాల ।
ప్రాణనాథుఁడు భార్య ♦ పక్షమైయుండేను
మిన్ను విఱిగినఁగాని ♦ మీఁదపడఁబోను ।
తప్పుఁజేసినఁగాని ♦ ఒప్పుగాఁజూడవలె
కసిగందు ఈబాల ♦ కడుచిన్నగోల ।
దాత దైవము తల్లి ♦ తండ్రివైనను నీవె
గురుఁడవైనను నీవె ♦ వరుఁడైన నీవె ।
అని పాదపద్మముల ♦ తనకన్నియను బెట్టి
పరమేశుపాదములఁ ♦ బడిమ్రొక్కులిడిరి ।
అత్తమామలఁజూచి ♦ యంబికానాథుండు
పలికెవారలతోడ ♦ పరమహర్షమున ।
ఇంతమీఁరలు చెప్ప ♦ నేల నే నెఱుఁగనా
సకియ నాప్రాణంబు ♦ సంశయము లేదు ।

26293
25·3·73

జీవధనమెవ్వరు ♦ చెడఁజూచుకొంటారు
బ్రతుకాశ లేనట్టి ♦ ప్రజలెందుఁగలరు ।
కులవధూమణులతో ♦ కలహింపఁగూడదని
శాస్త్రపద్ధతులంత ♦ చదివియెఱుఁగుదును ।
ఎఱిఁగియుండినగతికి ♦ మరుపేలవచ్చేని
ఒడలువఱచినశివము ♦ పుడమిలోఁగలదా ।
సకియ శ్రీగంగను ♦ జడలలోఁబెట్టుకొని
గాలిపారకుండ ♦ నేలుకొంటాను ।
కొదువేమిలేదు మీ ♦ గోల కిటమీఁదను
పొందిమీమందిరం ♦ బులకు వేడుకను ।
అని శంకరుఁడు పలుక ♦ అప్పుడాదంపతులు
తమబిడ్డఁగనియిట్టు ♦ లనిరిమోదమున ।
మాగర్భరత్నమా ♦ మమ్ముఁగన్నాతల్లి
నీవెఱుఁగనిదిలేదు ♦ నిఖిలమాతవుగా ।
నీబుద్ధికిని మెచ్చి ♦ నీకు భర్తాయెను
పార్వతీనాథుండు ♦ పరమేశ్వరుండు ।
భాగ్యశాలివి నీవు ♦ పలుమాటలింకేల
పరమమహాదేవు ♦ భార్యవు తల్లి ।
అయినఁజెప్పెదము నీ ♦ వాలించవోయమ్మ
తలిదండ్రిమాటకు ♦ తప్పరాదమ్మ ।

అత్తవారింటిప ♦ క్కగువారినెల్లను
దైవభావంబుగాఁ ♦ దలఁచుమోయమ్మ।
ప్రాణనాథుఁడు కోప ♦ పడి తిట్టినాగాని
మదిని అరమరలేక ♦ మసలుమోయమ్మ।
తల్లిదండ్రుల నన్న ♦ దమ్ములకంటెను
ఆడుదానికి ప్రాణ ♦ మధిపుఁడేసుమ్మి।
ఎల్లచుట్టాలు తన ♦ కెందఱున్నాగాని
పతిసాటిరారెవరు ♦ పద్మగంధులకు।
కోటిభాగ్యములున్న ♦ కోటిసంపదలున్న
ప్రాణనాథునివంటి ♦ భాగ్యంబులేదు।
కోటివ్రతములుచేసి ♦ కొామరొందినాగాని
పతిభక్తితోసాటి ♦ భామలకులేదు।
అత్తవారెవరైన ♦ అహంకారపడువేళ
మాఱుమాటాడకే ♦ మాయమ్మకాన।
అత్తవారలుతిట్టి ♦ నటువంటిమాటలు
నీవు దీవనలుగా ♦ భావించవమ్మా।
పరులతో నగఁబోకు ♦ పను లెన్నికలిగిన
పొరుగిళ్లు పలుమాఱు ♦ పోకుమోయమ్మ।
కన్నవారలయిల్లు ♦ కలలోనిభోగంబు
నిజముగా పతియింట ♦ నిలువుమోయమ్మ।

అలరు పుట్టింటికి ♦ అత్తవారింటికి
వన్నెమీఱఁగ మెలగు ♦ కన్నమ్మకాన।
ఆడుబిడ్డలయుసురు ♦ అది మహాచెడ్డది
పసుపుకుంకుమఁ బెట్టి ♦ పాలించవమ్మ।
హితవుగా మగఁడు చను ♦ విచ్చి పిలిచినఁగాని
మురియఁగాఁబోకుమీ ♦ ముదితమాతల్లి।
తల్లిదండ్రులకన్న ♦ దమ్ములకు వాడికలు
రంజిల్లమెలఁగుమీ ♦ రమణి మాతల్లి।
బీదసాదలపట్ల ♦ ప్రియముగా మెలఁగుమీ
కడువిశాలపుకీర్తి ♦ కలిగి మాతల్లి।
కలనయిన వల్లభుని ♦ సెలవుమీఱఁగఁబోకు
భక్తిగా మెలఁగుమీ ♦ పడఁతి మాతల్లి।
సిరులుగలిగినకొద్ది ♦ ఉరువణఁగియుండుమీ
పరమమార్గంబిది ♦ తరుణి మాయమ్మ।
పతిభక్తిసౌఖ్యంబు ♦ పతిభక్తిభాగ్యంబు
పతిభక్తిపుణ్యాంబు ♦ పడఁతి మాతల్లి।
పతిభక్తితోసాటి ♦ వ్రతము భువిలోలేదు
పతివ్రతాధర్మమునఁ ♦ బరఁగు మాతల్లి।
పతిభక్తిగలిగిన ♦ సతిని నీవుంటేను
పరాంద్రము ఎందఱుం ♦ టేమి నాతల్లి।

పెద్దది గౌరప్ప ♦ పిన్నదానవు నీవు
ఎఱిఁగివర్తించుమీ ♦ యింతి మాతల్లి ।
సవతిపోరన్న దె ♦ చ్చటను లేకుండంగ
మదిని అఱమరలేక ♦ మసలుమోయమ్మ ।
నీవు చుట్టాలకు ♦ నెయ్యంబుగా మెలఁగు
వాడికలుమీఱంగ ♦ వనిత మాతల్లి ।
నీకు తెలియనిదేది ♦ లోకమందున లేదు
ఆడవలసినమాట ♦ ఆడితిమి మేము ।
జాలరికులమెల్ల ♦ చాలపావనమయ్యె
నీవు పుట్టుటవల్ల ♦ నెలఁత మాతల్లి ।
ధవుఁడైన గురుఁడైన ♦ తనదైవమైనను
నవధనంబైన నె ♦ న్నఁగ శివుఁడెసుమ్మి ।
నీవు చింతిలనేల ♦ నిమిషమైననుగాని
నినుఁబాసియుండుమా ♦ నెలఁతమాతల్లి ।
ప్రతిరోజు ప్రతిపూట ♦ వచ్చేము నినుఁజూడ
చేరువైకనుపించు ♦ శ్రీకంఠుపురము ।
నీభాగ్యగరిమ వ ♦ ర్ణింప నెవ్వరితరము
రజతాద్రిపట్నంబు ♦ రాణివి నీవు ।
అనిచాలలాలించి ♦ అతివ నక్కునఁ జేర్చి
ఎత్తుకొనిముద్దాడి ♦ యెల్ల వేడుకను ।

తనయులను కడుపారఁ ♦ గని చల్లఁగా నీవు
వర్ధిల్లుమనుచు దీ ♦ వనయిచ్చియపుడు।
అతివనెత్తుకవచ్చి ♦ అందలములోఁ బెట్టి
మురిపెమున ఆవధూ ♦ వరులు వేడుకను।
అరణంబుచదివించి ♦ అదిగాక మిక్కిలి
సారెతోనవ్వేళ ♦ సాగనంపిరిగా।
శివమహాదేవుని ♦ సెలవుఁగైకొని వారు
ఏలూరిపట్నంబు ♦ కేతెంచిరంత।
శ్రీయిందరావరుఁడు ♦ శ్రీభారతీవరుఁడు
తమనివాసంబులకు ♦ తర్లిపోయిరిగా।
చూడవచ్చినయట్టి ♦ సురవరానీకములు
తమనివాసంబులకు ♦ తర్లిపోయిరిగా।
ప్రమథవర్గంబులు ♦ పరమయోగీంద్రులు
తమనివాసంబులకు ♦ తర్లిపోయిరిగా।
వచ్చియుండినయట్టి ♦ యచ్చరానీకములు
తమనివాసంబులకు ♦ తర్లిపోయిరిగా।
అపుడు శంకరుఁడు మా ♦ యావినోదుండగుచు
గౌరీమహాదేవి ♦ కానకుండఁగను।

---

శివుఁడు గంగాసహితుండై కైలాగిరికిఁజేరుట.

అరణమిచ్చినయట్టి ♦ అధికభాగ్యంబులు
సారెపంపినయట్టి ♦ సకలభాగ్యములు।
పొలఁతిశ్రీగారికి ♦ తెలియరాకుండంగ
తనవెండికొండపయి ♦ దాఁచెనొకమూల।
అందలములోనున్న ♦ అతివశ్రీగంగను
రావెశ్రీగంగయని ♦ రమ్మనుచుఁబిలిచి।
జటాజూటమునందు ♦ సకియసేవుండుమని
సెలవిచ్చిగంగను ♦ తలనుదాల్చెనుగా।
మాయావినోదుఁడై ♦ మదనసంహారుండు
రభసమునఁజనుదెంచె ♦ రజతశైలముకు।
ముందుగానారదుఁడు ♦ ముదముతోఁజనుదెంచి
గౌరీమహాదేవిఁ ♦ గనిచెప్పదొడఁగె।

నారదుఁడు శివుని వివాహవృత్తాంతము పార్వతికెఱింగించుట.

శంకరీశాంభవీ ♦ జగముకెల్లాతల్లి
వింటివా విపరీత ♦ వృత్తాంతమొకటి।
నీలకంఠుఁడునేఁడు ♦ జాలరికన్యను
పరిణయంబయినాఁడు ♦ పలుమాటలేల।
ముదిప్రాయమున తనకు ♦ ముచ్చటలువెలసెను
కామాఁతురండయ్యె ♦ కాలకంధరుఁడు।

ఎఱిఁగిఎఱుఁగనివాని ♦ వరుసగా నిప్పుడు
వచ్చెనదిగోచూడు ♦ వామదేవుండు।
కన్నచందంబు ని ♦ క్కముసీకుఁజెప్పితిని
మఱిమాయగలవాఁడు ♦ మాయశంభుండు।
అని చెప్పినారదుం ♦ డదృశ్యముయిపోయె
చెక్కిటను చెయిఁజేర్చి ♦ శ్రీగౌరిదేవి।
ఇంతగతివచ్చెనా ♦ ఈశ్వరాయనిచాల
తల్లడంబునుబొందె ♦ తానుగౌరమ్మ।
దేవిడీతలుపులను ♦ తీయవద్దని చెప్పి
తాళములుబంధించె ♦ తరుణిశ్రీగౌరి।
తలుపులుముద్రలు ♦ తాళంబులును వేసి
కూర్చుండెనచోట ♦ కొమ్మ గౌరమ్మ।
అంతలోశంభుండు ♦ అతివేగమున వచ్చి
తలుపుతియ్యవెయనుచు ♦ తానుబల్కెనుగా।
శివునిమాటాలించి ♦ శ్రీగౌరిదేవమ్మ
అధికవిభ్రాంతురా ♦ లగుచు నిట్లనియె

---

పార్వతీ పరమేశ్వరుల సంవాదము.

అరగడియ ననుఁబాయ ♦ నట్టి మహానీయుఁడవు
త్రిపురసంహారుఁడవు ♦ దేవాదిదేవ।

నన్ను ఇచ్చుటవిడిచి ♦ నా ప్రాణనాథ నీ
వెన్నడు లేదు నేఁ ♦ డెందుఁ బోయితివి।
వింటిగా నీ వేలు ♦ వృత్తాంత మెట్టిదో
వింతగా నుండెను ♦ విధము చూడఁగను।
మాయావినోదుఁడవు ♦ మాయ నీ కేమిటికి
నిజమైన సంగతికి ♦ నీకు చాఁపేల।
పాములజాడలు ♦ పాము లే యెఱుఁగును
నీళ్ళలో జాడలు ♦ నీళ్ళ కే యెఱుక।
నీమాయలన్నియును ♦ నే నెఱుఁగుదునుగాని
కన నెవరి శక్యంబు ♦ కలియుగములోన।
ఏలూరిపట్నంబు ♦ కే తెంచి జాలరి
కన్నెఁ బెండ్లాడుటలు ♦ కల్లలా నిజమా।
తెలియఁ జెప్పక తలుపు ♦ తీ సేది యిఁక లేదు
బొంకకుండఁగఁ జెప్పు ♦ పురహారా యిపుడు।
అని గౌరి పలుకంగ ♦ అంబికానాథుండు
ఎట్లు తెలిసెను దీని ♦ కీచంద మనుచు।
ఏమి సాధనము ఇఁక ♦ నేమి బొంకుదు ననుచు
అధిక విభ్రాంతుఁడై ♦ అతివ కిట్లనియె।
ఎంతమాటాడితివి ♦ యెలనాగ శ్రీగౌరి
యే పాపకర్మంబు ♦ యెఱుఁగనే నేఁడు।

ముదికాలమున నాకు ♦ మోహంబుగల్గునా
వట్టిదబ్బరలాడ ♦ వనితరో తగునా।
ఏల నాకీఁకపెండ్లి ♦ జాలరికన్నియ
నాముదిమి చూచితే ♦ నన్నెట్లువలచు।
అన్యాయమగుమాట ♦ లనఁదగునఁటే గౌరి
ఎవరుచెప్పిరి నీకు ♦ ఈలాటిబుద్ధి।
ఎవరుచెప్పితె నేమి ♦ ఈశ్వరా జాలరి
గంగనీవుదెచ్చుటలు ♦ కల్లలా నిజమా।
అయినపనికి నీకు ♦ అనుమానమేటికి
మఱుఁగువెట్టకయింక ♦ ఎఱిఁగించుస్వామి।
మాయలేటికి నీకు ♦ మబ్బులేటికి నీకు
కలతెఱఁగుదాఁచకను ♦ తెలుపుమీస్వామీ।
అనిగౌరిపలుకంగ ♦ ఆమహాదేవుండు
ఏమిబొంకుదు ననుచు ♦ ఈలాగుపలికె।
నాతి నిన్నిఁకనేను ♦ నమ్మింపఁగాలేను
బాసఁజేసెదనమ్ము ♦ భామశ్రీగౌరి।
బాసఁజేయుట యెంత ♦ పని నీకు శంభుఁడా
అసలుమాయలవాఁడ ♦ వయ్యసర్వేశ।
కాలసర్పంబు నా ♦ కంఠమునఁబట్టేను
నామాటయిఁకనైన ♦ నమ్మవే గౌరి।

కాలసర్పంబు నీ ♦ కరకంకణంబయ్యె
    అదియెంతపని నీకు ♦ మదనసంహారుఁడా।
విషము పానము చేతు ♦ వేయు నింకేమిటికి
    నెమ్మదిని నామాట ♦ నమ్మవే గౌరి।
కాలకూటమునీవు ♦ కబళించియున్నావు
    విషమెంతపని నీకు ♦ విశ్వరూపుండ।
అట్లయిన నిప్పులు ♦ అఱచేతఁబట్టెను
    నామాట యింకనైన ♦ నమ్మవే గౌరి।
తేటమీఱఁగ అగ్ని ♦ దేవుండు నీకన్ను
    నిప్పు లెంతటిపని ♦ నీకు పురహరుఁడా।
పదినిలువు నీటిలో ♦ పలఁజొచ్చి నిలిచేను
    నామాటయింకనైన ♦ నమ్మవే గౌరి।
నిండియుండినగంగ ♦ నీజడలఁబెట్టితివి
    పదినిలువులోఁతెంత ♦ పని నీకు శివుఁడా।
అట్లయితె కనకగిరి ♦ అఱచేతఁబట్టెను
    నామాటయింకనైన ♦ నమ్మవే గౌరి।
కనకగిరి నీచేత ♦ ధనువగుచు వర్ధిల్లె
    పరఁగ నీకదియెంత ♦ పని విరూపాక్ష।
పెద్దపులికంఠంబు ♦ బిగఁబట్టి నిలిచేను
    నామాటయింకనైన ♦ నమ్మవే గౌరి।

పులిఁజంపి చర్మంబు ♦ వలువగాఁగట్టితివి
నీకెంతపని యది ♦ నీలకంధరుఁడా।
బాసలన్నియు నీకు ♦ పాటిగాకుంటేను
ఎట్లు నమ్మింతునే ♦ యింకనిన్ను గారి।
కలబాసలే నీవు ♦ తెలియఁజెప్పితివయ్యా
నిన్నెట్లు నమ్ముదును ♦ నీలకంధరుఁడా।
ఏబాసఁజేసినా ♦ యింతి నీవు నమ్మవు
ఏమందునే నిన్ను ♦ యేమిసేయుదును।
కానవచ్చినపనికి ♦ గట్టెక్కఁగానేల
చెప్పవయ్యానిజము ♦ శివమహాదేవా।
నిజమబద్ధంబనుచు ♦ నీవెంచుచుంటేను
నిజమెట్లుచేసెదను ♦ నెలఁతరో గారి।
అచ్చజాజులు నీకు ♦ అర్పించె నెవ్వాతె
ఇఁకనెట్లు బొంకేవు ♦ ఈశ్వరా చెపుమా।
ఆకాశమార్గమున ♦ అజుఁడు గొనిపోవంగ
చెలువైనజాజులు ♦ చెయిజారిపోయె।
అవనిపైఁబడిపోవ ♦ హరునకర్పితమనెను
అవి నాశిరంబునం ♦ దమరెనే గారి।
సరిపడఁగబొంకితివి ♦ సాంబశివుఁడా నీవు
మఱి నిన్ను యింకొక్క ♦ మాట అడిగెదను।

పరమాత్మనీ మేన ♦ పసుపుకుంకుమలతో
    పరిమళగంధమె ♦ బ్బంగి నంటినదో ।
ఈమాట కల్లగా ♦ దికఁ నేల దాచేవు
    ఏరీతిబొంకేవు ♦ ఈశ్వరా చెప్పుమ ।
పసుపు నక్షింతలును ♦ పరిమళద్రవ్యములు
    విఘ్నేశ్వరునకిచ్చి ♦ విప్రవరులెల్ల ।
పుత్రుఁడౌటను మీఁదఁ ♦ బోర్లాడె నాతండు
    అంటె నామేనుపై ♦ అగరుగంధమ్ము ।
పోలికలుగట్టితే ♦ పొలఁతిరో శ్రీగౌరి
    రుజువివ్వవే నాకు ♦ నిజమైనవార్తి ।
నిజమైన సంగతికి ♦ రుజువేల పరమేశ
    మఱియును నేనొక్క ♦ మాట అడిగెదను ।
గళమునందును నీకు ♦ కస్తూరి రేఖలు
    కలిగియుండుట కేమి ♦ కారణము స్వామీ ।
కాలకూటము నేను ♦ కడ వేసికొంటిని
    గళము నీలపురేఖ ♦ గలిగెనే గౌరి ।
శాబాసు శంకరా ♦ జగదేకలావణ్య
    మఱియును నేనొక్క ♦ మాట అడిగెదను ।
కర్పూరవీడ్యంబు ♦ గలుగుటకు విధమేమి
    ఇఁకనెట్లు బొంకేవు ♦ ఈశ్వరా చెప్పుమా ।

తాంబూలమదియొక్క ♦ తప్పులోపనిగాదు
చెలువైన పీడ్యంబు ♦ చేస్తినే గారి ।
భువనరక్షా నీకు ♦ బొంకంగ పనియేమి
మఱియునే నిన్నొక్క ♦ మాట అడిగెదను ।
మోవినొక్కులగంట్లు ♦ ముదమార నున్నవి
యీమాట దబ్బరా ♦ వామదేవుండా ।
కాయజునిపైన ము ♦ క్కన్ను దెఱచిననాఁడు
మరునిగుఱ్ఱపుచిలుక ♦ కఱచెనే మోవి ।
చిలుకకాటేగాని ♦ చెలియనొక్కులగంట్లు
కావు పరికింపవే ♦ కాంతరో గారి ।
పురహర చాబాసు ♦ బొంకితివి సరిపడఁగ
మెచ్చవచ్చును ఎదు ♦ మేలుమాటలకు ।
జడలెల్ల మిక్కిలి ♦ తడిసె నెవ్విధమయ్య
సరిపడఁగబొంకుమీ ♦ శంభుమహాదేవ ।
సఖియరో విను మాదు ♦ సద్భక్తులందఱును
చల్లని పన్నీరు ♦ చాలఁ జల్లుదురు ।
పన్నీరుతడిగాని ♦ భామరో నేనేమి
జలకమాడుటలేదు ♦ సత్యమీమాట ।
ఏకర్తమెఱుఁగవు ♦ ఈశ్వరేశా నీవు
గోలవు సన్మార్గ ♦ శాలివే నిజము ।

నీమేను పరికింప ♦ నీచువాసన వేసె
    నీచువాసన కేమి ♦ నెపమయ్య స్వామీ।
ఈమాట కీఁక నీవు ♦ ఏలాగు బొంకేవు
    బొంకుమీ పురహర ♦ పొంకు మీఱఁగను।
మత్స్యావతారంబు ♦ మాధవుఁడు తాల్పంగ
    సహజముగ నే నటకు ♦ చనుదెంచినాను।
అతనితోఁ గలసి నే ♦ నబ్ధిలోఁ దిరిగితే
    పొలుసువాసన మేనఁ ♦ గలిగెనే గౌరి।
నిన్ను మీఱిన పనులు ♦ నేఁ జేయఁగాఁ బోను
    నామాట నిజముగా ♦ నమ్మవే గౌరి।
సైపఁజాలక జనులు ♦ చాడీలు చెప్పెదరు
    నమ్మ ధర్మముగాదు ♦ నళినాక్షి గౌరి।
ఇడుములు పెట్టు జను ♦ లెందఱైనా గలరు
    ఒరుల సఖ్యతఁ జూడ ♦ నోల్లఁజాలరుగా।
కొండెములు నమ్మకే ♦ గుణశాలివే నీవు
    చాడీలవల్లను ♦ సఖ్యములు చెడును।
నిజము సర్వేశ్వరా ♦ నీమాట సత్యంబు
    ఆడితప్పనివాఁడ ♦ వయ్య సర్వేశ।
అమరాసురులుగూడి ♦ అబ్ధి తఱచిననాఁడు
    అబ్ధిలోఁ బుట్టెను ♦ అమృతకుంభంబు।

అమృతకుంభంబెల్ల ♦ అమరులకిచ్చుటకు
స్త్రీరూపమయ్యెను ♦ శ్రీమహావిష్ణు।
ముదమైన శ్రీజగ ♦ న్మోహనాకారంబు
నీ కనులఁజూచితివి ♦ నీలకంఠుండా।
భరమైన మోహంబు ♦ పట్టి నిల్వఁగలేక
వెంటఁబడనాగితివి ♦ విశ్వేశ నీవు।
నీగుణము లెఱుఁగనా ♦ నిన్ను నే నెఱుఁగనా
కాముఁడా నేను నీ ♦ గతు లెఱుంగుదును।
కరకంఠ నీవెవరిఁ ♦ గలియక యుంటేను
కాలభైరవు నెట్లు ♦ గంటివో చెప్పుమా।
కరకంఠ యేకర్త ♦ మెఱుఁగకిపోతేను
కార్తికేయుని ఎట్లు ♦ గంటివో చెప్పుమా।
కోరి అశ్వత్థామ ♦ యేరీతిఁబుట్టెను
అంజనిసుతుఁ డెట్లు ♦ లవతరించెనుపో।
మనసు మెత్తనివాఁడ ♦ వని నేనెఱుంగుదును
కల్లమాటలు మాను ♦ కరకంఠ నీవు।
గోచరంబయ్యెనె ♦ గుణము లెల్లను నేఁడు
కానవచ్చెను నీదు ♦ కల్లసంగతులు।
వాదమేటికి పెక్కు ♦ బాస లేమిటికయ్య
కానవచ్చినపనికి ♦ కల్లలాడుటకు।

అఖిలలోకాధిపతి ♦ వైయుండి యీవిట్లు
    మిథ్యబాసలుపలుక ♦ మేలుగాదయ్య ।
అనియిట్లు చాలఖం ♦ డన మాటలాడితే
    గౌరితో నిట్లనియె ♦ కాలకంధరుఁడు ।
ఇల్లాలు దెప్పితే ♦ యెంతవాఁడైనాను
    నిలువ శక్యముగాదు ♦ నిజమె ఓశౌరి ।
అన్యాయమెఱుఁగ న ♦ న్నుల్లకులుపెట్టకే
    సాటివారలు చూడ ♦ సందేహమౌను ।
ఆక్షేపణకు మూల ♦ మవును ఈమాటలు
    నీకు ధర్మముగాదు ♦ నిత్యకళ్యాణీ ।
దండంబు దండంబు ♦ తప్పు నాయెడ వచ్చె
    దయఁజూడు దయఁజూడు ♦ తరళాక్షి నన్ను ।
నీసెలవుతప్పకను ♦ నిలిచియుండెద నింక
    తలుపువాకిట నిలిచి ♦ పలికితివి నిజము ।
పదివేలనేరములు ♦ భామరో నావల్ల
    పదివేలదండములు ♦ భామరో నీకు ।
అనుచు చేతులుమోడ్చి ♦ అంబికానాథుండు
    నిలువఁబడఁగాఁజూచి ♦ నెలఁతశ్రీగౌరి ।
విభ్రాంతురాలగుచు ♦ వేగముగా లేచి
    పతిమాటలకు ♦ మాఱు పలుకంగలేక ।

తత్తఱపాటున ♦ తలుపుఁదీసుకవచ్చి
సాష్టాంగదండంబు ♦ సమకొల్పియపుడు।
పతిని సందిటఁ బట్టి ♦ పదమనుచుఁ దోడ్కొనుచు
అంతఃపురంబులో ♦ కరిగె వేగమున।
అంతఃపురంబులో ♦ కరిగి వారిద్దఱు
హంసతూలిక తల్ప ♦ మందుఁగూర్చుండ్రి।
అపరాధి నపరాధి ♦ ననుచు గౌరీదేవి
పతిని సేవింపుచు ♦ భక్తిమీఱఁగను
రుద్రాక్ష కన్నియలు ♦ రూఢిగాఁ బ్రాధింప
భద్రాక్షకన్నియలు ♦ పాదములుపట్ట।
సుందరీమణులెల్ల ♦ సురటీలు విసరంగ
జలజాక్షులందఱును ♦ చామరలువీవ।
వెలఁదులు కొందఱు ♦ వీడ్యములు చుట్టియ్య
అతివలు కొందఱు ♦ అద్దములు చూప।
విరులపానుపునఁదు ♦ విశ్వనాథుఁడు గౌరి
సరససల్లాపములఁ ♦ జెలఁగుచుండిరిగా।
ఇష్టసిద్ధులుపరఁగి ♦ యిష్టోపవాక్యముల
హంసతూలికశయ్య ♦ నమరియుండిరిగా।
ఆత్మలోపలనేమి ♦ యరమరలు లేకుండ
భోగరాగంబులను ♦ పొలుపారుచుండ్రి।

ఆ రీతి సుఖములం ♦ దావధూవరు లుండ్రి
వారివేడుక లెంచ ♦ వశముగాదయ్య।
అంతరంగమ్మునం ♦ దఱమరలు లేకుండ
ఆనందులై యుండి ♦ రావధూవరులు।
ఒకనాఁటిసమయమున ♦ ఉల్లాసములు మీఱి
పార్వతీదేవియును ♦ పరమేశ్వరుండు।
మించి బలువేడుకలు ♦ మీఱి సొగటాపాళి
యాడఁగాదొడఁగేటి ♦ అవసరంబునను।
ఈశ్వరునిపందెంబు ♦ హెచ్చుమీఱుచునుండె
గౌరిపందెముక్రిందు ♦ గతిచెందియుండె।
భారయనిదొర్లించి ♦ గౌరిపందెము వేయ
దొర్లి పాచికవచ్చి ♦ దుగయగుచుపడియె।
తానొక్కపందెంబు ♦ తలపడివేసితే
కేరి పాచికవచ్చి ♦ క్రిందపడియెనుగా।
హరుఁడువేసినపందె ♦ మత్యద్భుతంబుగా
పలికినట్లుగ వచ్చి ♦ పాచికలు నిలిచె।
హరునిపందెంబు మీఁ ♦ దయ్యె ముమ్మాటికిని
ఓడిపోవుటలయ్యె ♦ ఉవిదగౌరమ్మ।
కరకంతుతోనట్లు ♦ గౌరియాడుటయెల్ల
దొంగతనముగ గంగ ♦ తొంగిచూచెనునుగా।

తొంగిచూచుచునున్న ♦ తొయ్యలిని పొడగాంచి
కడలేనికోపమున ♦ గౌరి యిట్లనియె।

---

గౌరి గంగాదేవుల సంవాదము.

ఎవరితవె శంభుశిర ♦ మెక్కి-కూర్చుంటివి
గయ్యాళి నాసవతి ♦ కంళ్లగానకను।
కంళ్లగానను అంత ♦ గయ్యాళి నేఁగాను।
గౌరప్ప ఆకాశ ♦ గంగనే నేను।
గంగవైతే నీవు ♦ గగనముం దుండకను
మగనిశిరమెక్కు-ట ♦ తగునటే గంగ।
మగనిఆజ్ఞకునేను ♦ మాఱుచెప్పఁగ లేక
ఉంచుమన్నా చోట ♦ నుంటి గౌరప్పా।
అట్లయితె మాఱు మా ♦ టాడకుండఁగనీవు
ఒదిగుండు మొకమూల ♦ ఒయ్యారిగంగ।
మదనాంతకుని కరుణ ♦ మనమీాద గలిగుంటె
ఒదిగుంటె మనకేమి ♦ కొదువ గౌరప్పా।
గతిమాలి నాయింట ♦ కడఁజేరియున్నావు
మత్సరము నాతోటి ♦ మానవే గంగా।
ముందుపుట్టిన శ్రవణ ♦ ములకంటె వెనుకగా
వచ్చిన కొమ్ములే ♦ వాడి గౌరప్పా।

అచ్చికలు బుచ్చికలు ♦ మచ్చికలు జేసుకొని
మరులుకొని నామగని ♦ తిరిగితివి గంగా।
వచ్చితిని ఇంకను నే ♦ వద్దన్నమానను
కచ్చుకొనుటకు నీతి ♦ గాదు గౌరప్పా।
హీనజాతివి నీకు ♦ ఎంతపొగరబ్బెనే
గతిమాలివచ్చిన ♦ గయ్యాళిగంగా।
ఇసుకలోబంగారు ♦ ఎలమితోఁబుట్టదా
యెచ్చోటఁబుట్టితే ♦ నేమి గౌరప్పా।
హిమవంతుపుత్రిని ♦ ఎల్లలోకంబులకు
పూజ్యురాలను నన్నుఁ ♦ బోలుదువె గంగా।
పాలసముద్రములో ♦ కాలకూటము పుట్టె
ఎచ్చోటఁబుట్టితే ♦ నేమి గౌరప్పా।
వలపుమందులు పెట్టి ♦ వలపించుకొంటివా
గడపదాఁటని శివుని ♦ గయ్యాళిగంగా।
వలపుమందులు చాల ♦ కలవు కొండలయందు
నీకు పుట్టిల్లది ♦ నిజమె గౌరప్పా।
కక్కసములాడితే ♦ కాయనే నిన్నిఁకను
తిరిగి కొట్టితె నీకు ♦ దిక్కెవరె గంగా।
దిక్కెన్న పని లేదు ♦ దిక్కులన్నిటికెవరు
దిక్కుఆవారె మనకు ♦ దిక్కుగౌరప్పా।

ంత చనువైతివే ♦ యింతలో నాసవతి
హరుని ముందఱ మాట ♦ లాడఁగల్గితివి।
ఃడల నన్నుంచె పా ♦ ర్శ్వమునందు నిన్నుంచె
చనువెవరిదే మిగుల ♦ సక్రియ గౌరప్పా।
వాపలమ్మేనీవు ♦ జాలరిదానవు
నిన్నెట్లు వలచెనే ♦ నీలకంఠుండు।
ులమెంచి తేలేదు ♦ గుణమెంచి తెచ్చెనే
జాతులెన్నఁగఁబోకు ♦ సవతి గౌరప్పా।
వలపుమందులమారి ♦ వన్నెతక్కులమారి
ఘనురాలవే నీవు ♦ గయ్యాళిగంగా।
ఘనురాలనైతేమి ♦ గయ్యాళినైతేమి
నీకుచెల్లెలుగదా ♦ నేను గౌరప్పా।
శిరసు దిగిరావేమి ♦ సిగ్గుమాలినదాన
ఇంతసామంత మెవ ♦ రిచ్చిరే గంగా।
భామ నినుఁబాయనని ♦ బాసలన్నియుఁజేసి
తెచ్చెనే అధికార ♦ మిచ్చెనే శివుఁడు।
అధికారమిచ్చినాఁ ♦ డని విఱ్ఱవీగకే
నిఱుపేదజంగమే ♦ నీలకంఠుండు।
ఇంద్రపదవికినెక్కు ♦ వీశ్వరుని భాగ్యంబు
కనరు మాట్లాడకే ♦ గౌరప్ప నీవు।

ఈముసలిజంగాని ♦ కేలాగువస్తివి
వలపుబులుపులు మీఱ ♦ వయ్యారిగంగా।
ముసలివాఁడయితేమి ♦ మొల్లవాఁడయితేమి
మూలకందుఁడుగదా ♦ ముక్కంటిశివుఁడు।
మూలకందుండనుచు ♦ మొదలునీకెటుదెలిసె
ఎన్నిమాటలునేర్చు ♦ కొన్నావెగంగా।
మాటలెఱుఁగనియట్టి ♦ మగువలెవరున్నారు
తప్పనాడఁగఁబోకు ♦ తరుణిగౌరప్పా।
సిగనెక్కియుండుటకు ♦ సిగ్గులేదఁటె నీకు
నీతిమాలినదాన ♦ నెఱజాణగంగా।
ఆకాశగంగనని ♦ హరుఁడు శిరమునఁదాల్చె
తప్పయినపనిగాదు ♦ తరుణిగౌరప్పా।
జాతితక్కువదాన ♦ జాలరి నాసవతి
ఎంతపొగరబ్బెనే ♦ యింతలోనీకు।
జాతితక్కువలెంచ ♦ సరిగాదె గౌరప్ప
జాతేమికారణము ♦ నీతికారణము।
చేఁపలమ్మిననీవు ♦ చెడ్డగయ్యాళివి
నీతులేర్పఱచఁగా ♦ నీవెవరెగంగా।
చేఁపలమ్మితెనేమి ♦ జెల్లలమ్మితెనేమి
కోరిశంభుఁడుఁదెచ్చు ♦ కొన్నాఁడుగదవే।

పొలుసు చేఁపలకంపు ♦ నిలువెల్లఁ గలువంగ
ఏమిరూపని తెచ్చె ♦ నే నిన్ను గంగా ।
రూపుగని తేలేదు ♦ రోసపడకే గౌరి
గుణమెంచి తెచ్చెనే ♦ కొమ్మరో నన్ను ।
కుల్లుచేఁపలకంపు ♦ నల్లనా యెఱ్ఱనా
చంపకొప్పులమారి ♦ జాలరిగంగా ।
నల్లనినీళ్ళకును ♦ నా డెమ్మై వర్తింతు
నల్లనెంచఁగఁబోకు ♦ నాతిగౌరప్పా ।
తీరుపులు నేరుపులు ♦ తేటపడఁజెప్పేవు
నీవెన్ని పొంకాలు ♦ నేర్చితివె గంగా ।
మర్యాద తప్పిన ♦ మాటలాడను నేను
కోపపడకే అప్ప ♦ పాపమే నీకు ।
మరులుకొని నామగని ♦ శిరమెక్కియున్నావు
ఇద్దఱిలో పాప ♦ మెవరిదే గంగా ।
శ్రీవిష్ణుదేవునికి ♦ చెలులు ముగ్గురు గలరు
పాపమెన్నినయట్టి ♦ ఫలమేమి గౌరూ ।
పుట్టెడుమాటలు ♦ పొట్టినాయేరాల
జాతినీతులు లేని ♦ జాలరిగంగా ।
నాకంటె యెక్కువ ♦ నీకు జాతియు లేదు
జాతులెన్నఁగఁబోకు ♦ సవతి గౌరప్పా ।

జాతికొంచెంబంటె ♦ సంశయముగలిగెనా
జాఱుకొప్పులమారి ♦ జాలరిగంగా।
కొండకూఁతురునీవు ♦ గుఱుతు లెన్నఁగఁబోకు
కండ్లుగానవు నీవు ♦ కాంత గారప్పా।
పతి సముద్రమువిడిచి ♦ పాపము వకొడిగట్టి
ఈమగని వరియిస్తి ♦ వింతెరో గంగా।
తండ్రి దక్షునిశిరము ♦ ధవునిచేఁగొట్టించి
తీర్పరిని గాలేదు ♦ తెఱవ గారప్పా।
చెల్లఁబో నీప్రజ్ఞ ♦ చెల్లునే నాసవతి
మాఱుకొంటున్నావు ♦ మైలారిగంగా।
మాఱుకొని నీవుంటె ♦ ఊరుకోఁదగునఁటే
ఇద్దఱును నిలువవలె ♦ ఇంతిగారప్పా।
అద్దుసద్దులు నీకు ♦ అవియెట్లు దెలిసెను
నీచుదానవు నీవు ♦ నెఱజాణ గంగా।
నీచువారలతోడ ♦ నీవు రావచ్చునా
వాసిగల సతివైతె ♦ వనితగారప్పా।
బులుపుదీటిచి నిన్ను ♦ బొందఁబెట్టకపోను
జాలరి నాసవతి ♦ జగడాలమారి।
అన్నమాటలు తిరుగ ♦ ఆడకుండఁగఁబోను
వాదంబు నాతోడ ♦ వద్దు గారప్పా।

వాదమువద్దనుచు ♦ వాదింపఁజొచ్చేవు
అట్లయితె నామగని ♦ కెట్లు వలచితివి।
పాదుకొని నేను రా ♦ లేదు నీమగనికి
నన్ను బులుపునఁదెచ్చి ♦ నాఁడెగౌరవ్వా।
నీచునాయే రాల ♦ నెఱజాణవే నీవు
గంపదింపులమారి ♦ గయ్యాళిగంగా।
నాజోలినీకేమి ♦ నీజోలినాకేమి
ఉన్నచోటను నీవు ♦ ఉండు గౌరవ్వా।
ఉన్నచోటను నన్ను ♦ ఉండుమన్నందుకు
తప్పకను నిజిహ్వ ♦ తఱిగింతు గంగా।
నీవుతఱిగినకూర ♦ నేనుతఱిగినకూర
వండివడ్డింతుమే ♦ వనితగౌరవ్వా।
చెంపకాయలుగొట్టి ♦ చెవులూడదీతునా
జగడపోతులమారి ♦ జాలరిగంగా।
నీవుగొట్టినకాయ ♦ నేనుగొట్టినకాయ
గంపనిండింతుమే ♦ కాంతగౌరవ్వా।
ఇప్పుడాడినమాట ♦ యీసారి ఆడితే
కుమ్మెదను పడఁద్రోసి ♦ కుత్సితపుగంగా।
నీవుకుమ్మినమన్ను ♦ నేనుకుమ్మినమన్ను
నీళ్ళకుదు రగునుగా ♦ నెలఁతగౌరవ్వా।

అతిచమత్కారంబు ♦ లాడకుండఁగనిన్ను
    పండ్లు జలజలరాల ♦ బడఁగొడుదుగంగా।
నీవు కొట్టిన పండ్లు ♦ నేను గొట్టిన పండ్లు
    బాలురకు పంచేమొ ♦ భామగారప్పా।
బాలురకు పండ్లన్ని ♦ పంచడమెట్టిదో
    తగ నిన్ను సిగఁబట్టి ♦ దంతు నే గంగా।
నీవుదంచిన వెనుక ♦ నే నూరుకోఁదగదు
    తగురీతి దంచేమొ ♦ తరుణి గారప్పా।
దంచడమెట్టిదో ♦ దగులు బాజీగంగ
    ఉరికితన్నుదుమోము ♦ ఉబ్బునట్లుగను।
చూడవేనాసవతి ♦ చూడవే యనిపలికి
    కన్ను లెఱ్ఱగఁజేసి ♦ కడురోషమునను।
ఘోరమైకోపంబు ♦ పట్టి నిల్పఁగలేక
    తన్నుదు ననుచు రౌ ♦ ద్రాకారియగుచు।
గౌరి లేవఁగఁబోవ ♦ గంగ తా జడలలో
    ఆశ్చర్యమొప్పంగ ♦ అణఁగిపోయెనుగా।
తలలోన శ్రీగంగ ♦ దాఁగియుండుటఁజూచి
    దాఁగినగంగతో ♦ తర్కమేలనుచు।

### గౌరి కోపగించి పుట్టింటికిఁబోవ నుద్యోగించుట

---

హారుమోమువీక్షించి ♦ అంబికయిట్లనియె
చెల్లునా నీప్రజ్ఞ ♦ శంభుమహాదేవ।
ఎవరితె లేదనుచు ♦ ఏలాగు బొంకితివి
ఏమెఱుఁగనని నోట ♦ ఎట్లు పలికితివి।
పదియాఱువిధములను ♦ బాసలు చేసితివి
నీకుసత్యంబేది ♦ నీకునిజమేది।
నీయొక్క ప్రఖ్యాతి ♦ నిజశీలమార్గంబు
ఎందుఁబోయెను జ్ఞాన ♦ మేమూలకరిగె।
జాలరికన్నియను ♦ ఏలాగుదెచ్చితివి
హీనవర్ణపుదాని ♦ నెట్లువలచితివో।
వచ్చినాననిమూలఁ ♦ బడియుండకను సవతి
మచ్చరింపుచు నన్ను ♦ మార్కొనఁగఁజొచ్చె
సవతిపోరుఁగబెట్టి ♦ చెవి నాలకించితివి
కాదుపోదనలేక ♦ కండ్లఁజూచితివి।
తరుణిపెట్టినమందు ♦ తలకెక్కెనా నీకు
వలపుమందులమారి ♦ వశముచెందితివా।
ఏది నీనిజమార్గ ♦ మేది నీప్రఖ్యాతి
ఏది నీ ఆచార ♦ మేది మహాదేవ।

నిజమైనసంగతికి ♦ రుజువుదెమ్మంటివి
రవ్వపెట్టితినంచు ♦ రట్టుచేసితివి ।
ముదికాలమున నీకు ♦ మోహ మేలంటివి
కల్లలాడితినంచు ♦ గాసిఁబొందితివి ।
నీచకాంతను దెచ్చి ♦ నీజడలఁబెట్టుకొని
సర్వంబుమిథ్యయని ♦ చాలబొంకితివి ।
అఖిలలోకాచార్యుఁ ♦ డవు మూలకందుఁడవు
పరమాత్ముఁడవు లోక ♦ పాలుఁడవు నీవు ।
నీవింతవాఁడవు ♦ నీ విట్లు చేసితే
ఏమనందును నేను ♦ యేమి సేయుదును ।
చేనుకావలివాఁడు ♦ చేను భక్షించిన
తండ్రిబిడ్డల నమ్మ ♦ తయ్యారుపడిన ।
అలసముద్రములోక ♦ ముల ముంచఁదలఁచిన
అవనిఁ గాల్పఁగ నగ్ని ♦ ఆలాయపడిన ।
అవనిప్రాణులకెల్ల ♦ అన్నంబు విషమైన
జనవరుం డన్యాయ ♦ మును జేయుచున్న ।
ధరణిపై గగనంబు ♦ విఱిగింపఁజూచినా
ప్రాణవల్లభుఁడు భా ♦ ర్యానొల్లకున్న
తగదనుచు వాదించు ♦ ధన్యులెవ్వరుగలరు
నిజపద్ధతుల మీరు ♦ నిలుపవలెఁగాక ।

నీతోను వాదింప ♦ నేనెంతదానను
    లోకకర్తవు నీవు ♦ లోకాధిపతివి।
నన్నుకన్నడచేసి ♦ నామీఁద నొక్కతెను
    తెచ్చి బొంకఁగనేల ♦ దివ్యస్వరూప।
కాలమంతయు నీకుఁ ♦ గడచి ముదికాలమున
    కోరితెచ్చితివి జా ♦ లారికన్నియను।
అయిన సంగతికి నీ ♦ వను మానపడనేల
    తారకాణపు పనికి ♦ దాఁపు నీకేలా।
అది నీవుఁగూడియు ♦ ప్టాలాపములతోడ
    యోగ్యకరములుమీఱి ♦ యుండఁగావచ్చు।
తగదు నీకని యెవరు ♦ తలపెట్టఁగా లేరు
    అనలాక్షుఁడవు నీవు ♦ అఖిల మెఱుఁగుదువు।
చాలు నీతోటి సం ♦ సారజాలంబింక
    పడుచుకాంతనుగూడి ♦ ప్రభవిల్లుస్వామి।
నుదుటవ్రాసినవ్రాఁత ♦ నులిమితే చెడిపోదు
    అనుభవింపకతీఱ ♦ దనుభవంబెల్ల।
సవతిమీఁదను బ్రదుకు ♦ చలముకొని వ్రాసిన
    బ్రహ్మానన వలెఁగాక ♦ పనియేమి నిన్ను।
వ్రాఁతకొలఁదిగ బ్రతుకు ♦ వస్తుంది నిన్ననఁగ
    పనియేమి యిఁకనాకు ♦ పరమేశ్వరుండ।

పుట్టినింటికి వెళ్ళి ♦ పోతాను సెలవిమ్ము
ముదికాలమున నీకు ♦ ముచ్చటలు వెలసె ।
మధ్యనే నుంటేను ♦ మనసార దంపతుల
కేళీవిలాసముకు ♦ చాల అడ్డములు ।
సెలవిమ్ము పుట్టిల్లు ♦ చేరఁబోయెదనింక
దయయుంచు పదివేల ♦ దండములు మీకు ।
పుట్టినింటికి వెళ్ళి ♦ పోతినని నామీఁద
దయతప్పి కోపమ్ముఁ ♦ దాల్పంగఁబోకు ।
నీపదధ్యానంబు ♦ నిల్పి కలలోనైన
మఱవకుండెద నీదు ♦ మహిమలన్నియును ।
సెలవు ముమ్మాటికి ♦ సెలవిమ్ము మహాదేవ
సెలవైతె పుట్టిల్లు ♦ చేరఁబోయెదను ।
అని పాదపద్మముల ♦ వనిత తాప్రణమిల్లి
సాగిపోవఁగఁజొచ్చె ♦ శర్వాణిదేవి ।

---

అలిగిపోవుచున్న గౌరిని శివుఁడు బతిమాలి నిలుపుట.

శర్వాణి దేవిట్లు ♦ సాగిపోవుటఁజూచి
చంచలచిత్తుఁడై ♦ శంభుదేవుండు ।
దుడుకుపాటున నీవు ♦ చెడకు గుబ్బున లేచి
నిలువవే కోమలి ♦ నిలువవే యనుచు ।

పరుగెత్తి సతిచెఱఁగు ♦ పట్టుకొని పోనియక
సందిటను బట్టుకొని ♦ సర్వేశ్వరుండు।
సందిటను బట్టుకొని ♦ చనుదేర నియ్యకను
తగునె కోమలి నీకు ♦ తగునటే యనుచు।
తీసుకొనివచ్చి గ ♦ ద్దియనుండఁగాఁ బెట్టి
మోముమోమునఁ జేర్చి ♦ ముద్దాడుకొనుచు।
ముక్కెరఁదొలగించి ♦ ముమ్మాఱు ముద్దుగొని
కౌఁగిలి గావించి ♦ కడుగారవించి।
మోము చెమ్మటఁదుడిచి ♦ ముంగురులు ఎగదువ్వి
సరగుమీఁఱఁగఁదుడిచి ♦ విరిసరులుచుట్టి।
వీడ్యంబు దయచేసి ♦ విరులపానుపునందు
కూర్చుండఁగాఁ బెట్టి ♦ గోప్యమార్గమున।
మనసెల్ల కరఁగించి ♦ మది బుజ్జగించుచును
చాల లాలనచేసి ♦ శంభుఁడిట్లనియె।
హరియు బ్రహ్మాదులకు ♦ వెలవనివాఁడను
నీలకుంతల నేను ♦ నీకు వెలచితిని।
తప్పునాయెడఁగల్గె ♦ తగ నీకు వెలచితిని
ఒడఁబడుచు నాతప్పు ♦ గడుపుమంటినిగా।
ఒడఁబడ్డ వేళ నీవు ♦ చెడనాడఁగా తగున
నీకు తెలియని నీతి ♦ లోకమునఁ గలదా।

పతిచేయుతప్పులను ♦ బైటఁబెట్టనికాంత
పరమ పతివ్రత ♦ భామినీతిలక।
నీవంటియిల్లాలు ♦ నీవంటి సుగుణవతి
పదునాల్గులోకములు ♦ వెదకినాకద్దా।
హరివెలఁది శ్రీలక్ష్మి ♦ అజువెలఁది భారతి
నినుఁబోలువారలా ♦ నిత్యకల్యాణి।
పరమపతివ్రతా ♦ భామినీతిలకము
గడపవలె నాతప్పు ♦ కాయవలె నన్ను।
మేనులు రెండొక్క ♦ టైన విధమున నాకు।
అర్ధనారీశ్వరుం ♦ డను పేరుగలిగె।
నాతప్పు నీతప్పు ♦ నాకీడు నీకీడు
నాజయము నీ జయము ♦ నమ్ము ఈమాట।
నీవెనుక నేగదా ♦ నెలఁత యెవ్వారున్న
నీతోసమానులా ♦ నెరజాణలెల్లా।
ఆడితప్పినవాఁడు ♦ హరిమహాదేవుఁడని
పలుకుదురు భువిలోన ♦ ప్రజలెల్ల నన్ను।
తగునని గంగను ♦ మిగుల నేఁదెస్తిని
ఇపుడు పొమ్మనుటెంత ♦ అపకీర్తిమాట।
అపకీర్తి మాటని ♦ వనఁజెల్లునా నోట
కలికిరో ప్రాణమొ ♦ క్కటి నీకు నాకు।

నీకీర్తి నాకీర్తి ♦ నీమేలు నామేలు
నీ సుఖము నా సుఖము ♦ నీవు నే నొకటి।
పరఁగుకైలాసగిరి ♦ పట్నంపుదేవివి
అలరంగ అధికార ♦ మంతయును నీదె।
నీ యిల్లు నీ సొమ్ము ♦ నీబ్రదుకు నీప్రజలు
అంతటికి నీయాజ్ఞ ♦ ఆలాయపడును।
కులమువల్లనునైన ♦ గుణమువల్లనునైన
సరికాదు నీకెపుడు ♦ జాలరిగంగ।
మదిని నీవిఁకను అఱ ♦ మరలెన్నటికి మాను
కలలోననేను నీ ♦ సెలవుదాఁటనుగా।
నమ్ము ముమ్మాటికి ♦ నామాట శాంభవి
నాదుప్రాణము నీది ♦ నామేను నీది।
కలనయిననేను నీ ♦ సెలవుదాఁటనటంచు
బాసలొనరించె నా ♦ పరమేశ్వరుండు।
అగ్నిసాక్షిగ బాస ♦ లపు డీశ్వరుఁడుపలుక
మగనిమాటకు గౌరి ♦ మాటాడకుండె।
ఆమాటలకు గౌరి ♦ అపు డూరకుం డెనని
సంతోషమునుబొందె ♦ సర్వేశ్వరుండు।
లోకము లెల్లలో ♦ లతనుబొందించేటి
శివుఁడు గౌరిని వేడ్కఁ ♦ జెందించ లేఁడా।

ఇద్దఱొక్కవిధాన ♦ యిష్టోపవాక్యముల
ప్రొద్దుపుచ్చుచునుండ్రి ♦ భోగరాగముల।
వారిసంతోషములు ♦ వారిసంభాషణలు
కనులనిండాఁజూచె ♦ కాంతఁ శ్రీగంగా।
కడుపులోఁ చెయిపెట్టి ♦ కలిపినట్లాయెను
పూనిబల్లెముతోడఁ ♦ బొడిచినట్లాయె।

---

గంగాదేవి గౌరిమీఁద నలిగి పుట్టింటికిఁబోవుట.

మదిచంచలత్వమున ♦ మనసుపట్టఁగలేక
చిడిముడిపాటున ♦ చీకాకుపడియె।
జడలమీఁదికి దుమికి ♦ సరగ నేలకు ఉరికి
హరమహాదేవుతో ♦ అపుడు ఇట్లనియె।
శాబాసు శంకరా ♦ జగదేకలావణ్య
ఇంతఘనుఁడవటంచు ♦ ఎఱుఁగనైతినిగా।
గౌరప్పచే నన్ను ♦ కల్లలాడించితివి
మిగులనాడించితివి ♦ తగనివాక్యములు
పూనితన్నెదనంచు ♦ పొలఁతి మాగౌరప్ప
తన్నవస్తే నేను ♦ దాఁగుంటి జడల।
కనులఁజూస్తివిగాని ♦ కాదుపోదనవైతి
ఎదురుచెప్పఁగలేక ♦ బెదరియుంటివిగా।

అన్నె కారపువాఁడ ♦ కన్నులతోఁ జూచితిని
  తెలిసె నీ గుణమెల్ల ♦ తేటతెల్లముగా ।
తేటతెల్లంబుగా ♦ తినక రుచి తెలియదు
  ఖ్యాతిమీరఁగ చూరక ♦ లోఁతు తెలియదుగా ।
ఆలిమీఁదను బ్రతుకు ♦ అందంబుగాదనుచు
  తల్లి చెప్పినమాట ♦ డాకలాప డెను ।
ఆలి నీకింత బె ♦ ల్లపుకొండ అయి తేను
  ఆలిమీఁదను నన్ను ♦ ఏల దెచ్చితివి ।
ఇంతచాలనివాఁడ ♦ వేల ననుఁదెచ్చితివి
  ఏలూరిపట్నంబు ♦ కేల వచ్చితివి ।
అఖిలలోకాధిపతి ♦ వనుకుంటినేగాని
  ఇంతగా భయపడుట ♦ యెఱుఁగనైతినిగా ।
ఆడుదానికి నీవు ♦ అతివిధేయుఁడ వగుచు
  ఇంత భీతిల్లుట ♦ యెఱుగనైతినిగా ।
బ్రహ్మ వ్రాసినవ్రాలు ♦ పాటిపడియుండంగ
  నిన్ననఁగ పనిలేదు ♦ నీలకంధరుఁడా ।
నిజముగా నన్నుంచి ♦ నీవుభయపడఁగానేల
  భార్యనుపలుమాఱు ♦ బతిమాలనేల ।
గారప్పనన్ను త ♦ ర్కపుమాటలననేల
  తన్నవస్తే నేను ♦ దాఁగుండనేల ।

తగమీారలిద్దఱుచు ♦ తంటాలుపడనేల
నీవు గతియని నేను ♦ నిలువంగనేల।
నీవిధేయతలెల్ల ♦ నేను చూడగనేల
కలసంగతులునేను ♦ తెలుపంగనేల।
పుట్టినప్పటినుండి ♦ పోషించుతలితండ్రి।
ఇఁకమీాఁదనన్ను పో ♦ షించంగలేరా।
నేను పుట్టినతావు ♦ నే చేరియుంటాను
నిండువేడుకనుండు ♦ నీభార్య నీవు।
సెలవిమ్ము పుట్టిల్లు ♦ చేరి నే నుంటాను
అని శంభుమూర్తికి ♦ ప్రణమిల్లె గంగా।
ప్రణమిల్లి దరినున్న ♦ పార్వతినిఁబొడగాంచి
యెదురుగా నిలువఁబడి ♦ యిట్లుపలికెనుగా।
ఓయప్ప గారప్ప ♦ ఓ భాగ్యములకుప్ప
శాబాసుపో నీకు ♦ చెల్లునే ప్రజ్ఞ।
నీతోవిరోధమును ♦ నిర్వహించఁగలేను
నీతిట్లు పడలేను ♦ నిలువంగలేను।
శంభుమూర్తికి వచ్చి ♦ చాల నే తిన్నాను
నీచేతమాటలును ♦ నీచేతికొట్లు।
పదివేలుపదివేలు ♦ భాగ్యంబుభాగ్యంబు
చాలుచాలును ఇట్టి ♦ సంసారసుఖము।

సామంతబిడ్డనని ♦ సామంత చూపితివి
నిస్సారపెట్టితివి ♦ నెలంతరో నన్ను ।
భయము యావత్తు నా ♦ పలుకులఁదెలియదు
క్రియప్రధానము బెద ♦ రింపులుకావు ।
నీలకంఠుఁడునీవు ♦ నిఖలసంతోషమున
కేళీవినోదముల ♦ నోలలాడండి ।
ఎంతపని గలిగినా ♦ యింతి నీవద్దికి
రాను వస్తే ఒట్టు ♦ పూనుకుంటాను ।
నీకెంతపనియున్న ♦ నీవు నావద్దికి
నెరయంగవస్తివా ♦ నిజముగా ఒట్టు ।
కోరివచ్చేవు అయి ♦ దాఱురోజులలోన
తెలియును నీయొక్క ♦ బలవంతమెల్ల ।
మనసులోనుంచుకో ♦ మ్మని చతాయింపుచు
చనిమె పుట్టింటికి ♦ జాలరిగంగా ।
తల్లిదండ్రులతోడ ♦ తానేమిచెప్పకను
చూడవచ్చితినంచు ♦ సుదతి బొంకెనుగా ।
గారప్పగర్వంబు ♦ యేరీతి దింతునని
మనసులోపల తలఁచె ♦ వనితశ్రీగంగా ।
జగములోపలఁగలుగు ♦ జలనిధులుయావత్తు
ఇంకి బీఁటలువాఱ ♦ నెండింపఁజేసి ।

### గౌరిమీద కోపంబున గంగాదేవి నదులయందలి యుదకము నింకింపఁజేయుట.

---

గంగయెట్లాటిదో ♦ కనుల కగపడకుండ
　　మాయగావించె భూ ♦ మండలంబెల్లా ।
వనితశ్రీగంగ వె ♦ ళ్లిన మఱురోజున
　　బాండుదూరంబయ్యె ♦ పార్వతీదేవి ।
బాండుదూరంబగుచు ♦ భామగౌరీదేవి
　　కొలనులోపలికేఁగె ♦ జలకమాడుటకు ।
కోటిదివ్యాంగనలు ♦ కూడి తనతోనడువ
　　కొలనులోపలికేఁగె ♦ జలకమాడుటకు ।

---

### గౌరి తటాకముల జలంబుగానక తల్లడించుట

కొలనుబీఁటలువాఱె ♦ జలము లేకుండంగ
　　విభ్రాంతురాలగుచు ♦ వెలఁది శ్రీ గౌరి ।
ఇదియేమిపాపమో ♦ యెఱుఁగంగరాదనుచు
　　విభ్రాంతురాలగుచు ♦ వెలఁది శ్రీ గౌరి ।
స్నానంబుచేయుటకు ♦ జలము లేదాయెనని
　　తల్లడంబునుబొంది ♦ తరుణి శ్రీగౌరి ।
దారిజనములఁబిలిచి ♦ తానిట్లు పలికెను
　　వింటిరా నేఁడొక్క ♦ వృత్తాంతమొదవె ।

ఏమిపాపమొకాని ♦ యీవేళ మనయూర
కాసారములయందు ♦ గంగ లేదాయె।
నీళ్ళబావులయందు ♦ నిజతటాకములందు
కడుచిత్రమెట్టిదో ♦ గంగ కనుపడదు।
ఈమైలతోనేను ♦ ఏరీతినుందును
సాధనంబే దిఁకను ♦ జలజాక్షులారా।
పొలఁతులారామీరు ♦ భూలోకమున కేఁగి
నదులందు నిధులందు ♦ నవ్యభూములను।
సెలయేఱులందును ♦ చలువస్థలములయందు
తీర్థస్థలములందు ♦ దివ్యభూములను।
వెదకి తీసుకరండి ♦ వేగమున నుదకంబు
నిర్మలస్నానంబు ♦ నేఁజేయవలయు।
నిర్మలస్నానంబు ♦ నేను చేసినఁగాని
అరయ శివార్చనకు ♦ అర్హంబుకాదు।
చెలఁగి శివార్చన ♦ సేయకయుండిన
భోజనాపేక్ష యిఁక ♦ పూజ్యంబుసుండి।
అని దాదులకుఁజెప్ప ♦ ఆదాదులవ్వేళ
పొలఁతి గౌరీదేవి ♦ సెలవుమార్గమున।
పసిఁడికుండలుపట్టి ♦ భామలే తెంచిరి
తెలియంగఛప్పన్న ♦ దేశభూములకు।

గౌతమీ జాహ్నవీ ♦ కావేరి మొదలైన
నదులెల్ల వెదకి రా ♦ సతులు తనరంగ।
నూటయెనిమిది దివ్య ♦ దేశములు తిరుపతులు
వెదకిరి వెయిసారి ♦ సుదతిరత్నములు।
వెదకి వేసారుచును ♦ వెలఁదులందఱుగూడి
అయ్యారే దైవమా ♦ యనుచు భీతిలుచు।
కైలాసగిరిఁజేరి ♦ గౌరీమహాదేవిఁ
గని మ్రొక్కి పలికిరి ♦ వినయంబుమీఱ।
ఓయమ్మ మాతల్లి ♦ ఓ జగద్రక్షణీ
శంకరీ శాంభవీ ♦ జగముల తల్లి।
సెలవుప్రకారమున ♦ ఛప్పన్న రాజ్యములు
నదితీరములనెల్ల ♦ వెదకిచూచితిమి।
వెదకి వెదకియు చాల ♦ వేసారివచ్చితిమి
పుడమిలో నదులందు ♦ బురదైన లేదు।
ఇంకి బీఁటలువాఱి ♦ యెల్లనదులున్న యవి
ఏమిచందమొకాని ♦ యెఱుఁగ లేమమ్మా।
అఱకాళ్ళు పొక్కంగ ♦ తిరిగితిమి దేశములు
వట్టికష్టంబయ్యె ♦ వనితరో మాకు।
పదునాల్గు భువనముల ♦ పాడుకొని వచ్చితిమి
మాయ మాయెను గంగ ♦ మహిలోన లేదు।

చెప్పడానకు మనసు ♦ చిన్నఁబోయున్నది
ఈలాటి కబురు మే ♦ మెట్లు చెప్పాదుము।
అని వారు తెల్పఁగా ♦ తన కేమితోఁచకను
తల్లడంబునుబొంది ♦ తరుణి గారమ్మ।
తల్లడంబునుబొంది ♦ తన కేమి తోఁచకను
చెక్కిటను చెయిఁజేర్చి ♦ చిన్నఁబోయెనుగా।
మూడులోకంబులకు ♦ మూలకర్తగు తల్లి
గంగ మాహాత్త్యంబు ♦ గనఁజాలదాయె।
పదునాల్గు భువనములు ♦ పాలించు జగదంబ
గంగ మాహాత్త్యంబు ♦ గనఁజాలదాయె।
ఎల్లరివలె తాను ♦ తల్లడిల్లుచునుండె
గంగ మాహాత్త్యంబు ♦ గనఁజాలదాయె।
గంగ మాహాత్త్యంబు ♦ గనఁజాల లేకను
గణనాయకులఁ బిలిచి ♦ తను పలికె నిట్లు।
నాముద్దులకుమార ♦ నాతండ్రి గణనాథ
వింటివా నేఁడొక్క ♦ విపరీత వార్త।
ఆఱుదినములు బొందు ♦ దూరమైయుంటిని
నిర్మలస్నానంబు ♦ నేఁజేయ లేదు।
నిర్మలస్నానముకు ♦ నీళ్లు లేవాయెను
పంపి స్త్రీదాదులను ♦ పైనంబుచేసి।

ఆజ్ఞతప్పకదాదు ♦ లరుదెంచిచూచిరి
పదునాల్గు లోకముల ♦ నదులు యావత్తు।
పదునాల్గు లోకముల ♦ నదులన్ని వెదకినా
ఇంకి బీటలువారి ♦ యెల్లలోకములు।
వెదకి వెదకియు చాల ♦ వేసారి వేసారి
తల్లడిల్లుచువచ్చె ♦ దాది సంఘములు।
ఇదియేమి కర్మంబు ♦ ఇదియేమి చిత్రంబు
ఇదియేమి మాయ నా ♦ కెఱిఁగింపు పుత్రా।
సహజమాని ర్మల ♦ స్నానంబు లేకుండ
ఏరీతి విహరింతు ♦ నేమిసేయుదును।
వీరశైవాచార ♦ విధు లెట్లు సల్పుదును
సద్ధర్మనియతు లే ♦ చందానఁ జేతు।
రామతారక మెట్లు ♦ నామదిని పరియింతు
ఈ హీనమార్గంబు ♦ నెట్లుభరియింతు।
అని తల్లి పలుకంగ ♦ అపుడు గణనాయకుఁడు
మదిని శోకింపుచును ♦ మఱి యిట్లుపలికె।
ఓతల్లి జగదంబ ♦ ఒప్పుగా వినవమ్మ
యిదిగంగమాయ యొం ♦ డేమి లేదమ్మా।
దానిమహిమెఱుఁగక ♦ తరుణిగా భావించి
తర్కమున గంగను ♦ తన్నఁబోతివిగా।

కోపంబు తనమదిని ♦ కాపురము పెట్టుకొని
అలిగి పుట్టింటికి ♦ అరుదెంచె గంగ।
ఎల్లలోకమునదులు ♦ యింకింపఁజేసెను
పరగంగ నీకు ఇ ♦ బ్బందివచ్చెనుగా।
ముట్టుదోషము నీకు ♦ మూలమైయుండెను
సెమమంతయుఁదప్పి ♦ నిలువఁగలదెపుడు।
గంగామహాదేవి ♦ కలుగఁజేసినమాయ
గాని యితరులమాయ ♦ గాదు మాతల్లి।
అది సర్వజనపోషి ♦ అదియు మంజులవాణి
అది లోకపావని ♦ అది లోకజనని।
దానితోతర్కంబు ♦ తగదు నీవెఱుఁగక
వాదమాడితివిగా ♦ మీఁదుగానకను।
జాలరితనుజ ని ♦ స్సారంబుచేసితివి
దానిమాహాత్మ్యంబు ♦ గానవైతివిగా।
ఆడితివి వాదంబు ♦ ఆచుకో కష్టంబు
ఎదురుసత్తువదెలియ ♦ కెగ్గులాడితివి।
భావించిచూడఁగా ♦ పావనలుమీరిద్ద
రొకయింటిబిడ్డలు ♦ ఒకనిభార్యలుగా।
హిమవంతు దేహమున ♦ ఇంపారఁగావెడలె
విష్ణుపాదాబ్జమున ♦ వెలసె శ్రీగంగా।

హిమవంతు భార్యయగు ♦ యింతి మేనక దేవి
గర్భవాసమునందుఁ ♦ గలిగితివి నీవు।
మీకు భేదము లేదు ♦ మీరిద్దరొక్కటి
మూలమెఱుఁగక ♦ యిట్లు మోసపోతివిగా।
కాలఁది తెలియక నీవు ♦ కొంచెపఱచితివమ్మ
కొంచెపఱచినమాట ♦ కొనసాగదమ్మా।
ముఱిముఱిమాటలకు ♦ దూరితపడఁగూడదు
ఎఱిఁగి అజ్ఞానమున ♦ ఏలపడితమ్మా।
తన్నుఁజూడఁగనింక ♦ తల పెట్టవలదనుచు
ఒట్టు పెట్టెనుగదా ♦ గట్టిగా గంగా।
ఒట్టు పెట్టినగంగ ♦ యొద్దికి నీవిపుడు
తలవంచుకొని పోక ♦ తప్పదే తల్లి।
ఎల్ల వృత్తాంతంబు ♦ ఇపుడు మా తండ్రితో
మనమిద్దరము వెళ్లి ♦ యెఱిఁగించవలెను।
అని తల్లితోఁబలుక ♦ ఆ తల్లియును తాను
వెంటనే చనిరి ము ♦ క్కంటిఁజూడఁగను।
నీలకంఠుని యెదుట ♦ నిలిచి చేతులు మోడ్చి
కలతెఱంగంతయును ♦ తెలియఁజేసిరిగా।
విని మహాదేవుండు ♦ తనుఎఱుఁగనట్టుగా
అధిక విభ్రాంతుఁడై ♦ అప్పుడిట్లనియె।

ఇదియేమి ఆశ్చర్య ♦ మీలాటి సంగతి
    యేకాలమున లేదు ♦ ఇట్టి చిత్రంబు।
పొందుగా పదునాల్గు ♦ భువనంబులందును
    జలముశూన్యంబగుట ♦ సందేహమయ్యె।
ధర జనులు యీవత్తు ♦ తపియించుచుండిరి
    జపహోమ సత్క్రియల్ ♦ చేయలేరైరి।
అల్లకల్లోలమై ♦ తల్లడిల్లిరి ప్రజలు
    నిద్రతృష్ణాహార ♦ నియమములు దప్పి।

---

గౌరిదేవి శివుని యాజ్ఞప్రకారము కుమారునితోఁగూడి గంగయొద్దకు బోవుట.

పాలు ఆహారముచె ♦ బ్రతికియుండిరి జనులు
    ఇట్లయితె జీవులకు ♦ యేమిసాధనము।
ఈవింతగలుగుటకు ♦ యితరమార్గము లేదు
    కరమొప్ప జాలరి ♦ గంగ దీమాయ।
జాలరిగంగతో ♦ జగడంబువద్దనుచు
    చెప్పితె కోపంబుఁ ♦ జెందె సితల్లి।
ఎంతకోపించినా ♦ యెన్నితాఁదిట్టినా
    మాఱుమాటాడక ♦ ఊరకుంటినిగా।
కాదుపోదని నేను ♦ గట్టిగాఁజెప్పితే
    పెనుకొన్నకోపాన ♦ వినదు సితల్లి।

వినని మాటకు నేను ♦ వివరించకూడదని
మాఱుమాటాడక ♦ ఊరకుంటిని గా।
వెలఁది పుట్టింటికి ♦ వెళ్లి పోయినఁగాని
కలహాగతులకు జడిసి ♦ పిలువనైతిని గా।
ఒప్పుగా నే పిలువ ♦ కూరకున్నందులకు
తెలవ గౌరీదేవి ♦ తిట్టినందులకు।
కోపమున శ్రీ గంగ ♦ యీపగిదిఁ జేసెను
నే వెళ్ళి పిలుచుటకు ♦ నియతంబు గాదు।
బాసలన్నియు చేసి ♦ భార్యచే తిట్టించి
యేలవచ్చెనటంచు ♦ ఎంచేరు జనులు।
పనిఁ బూని కక్కుర్తి ♦ పడి నేను వెళ్లితే
రభసమున నా వెంట ♦ రాదు శ్రీగంగ।
నేరస్థురాలని ♦ నీతల్లి వెళ్లినా
రభసమున దానితో ♦ రాదు శ్రీ గంగ।
విద్యలకు పూజ్యుఁడవు ♦ విఘ్నేశ్వరుండవు అ
నాగతవర్తమా ♦ నము లెఱుంగుదువు।
నీతల్లిఁ దోడుకొని ♦ నీ వెళ్లినంతట
నినుఁ జూచి మాఱుమా ♦ టన లేదు గంగ।
మధురోక్తి హితవుగా ♦ మాట్లాడఁ జాలుదువు
కంటకము మాని నీ ♦ వెంట రాఁగలదు।

ఇదియుపాయముగాని ♦ యితరమార్గము లేదు
కాలినడకను మీరు ♦ కదలిపోవలెను।
కాలినడకను మీరు ♦ కదలివెళ్లినఁగాని
చలముడుగదెంతయును ♦ జాలరిగంగ।
అని తండ్రి పలుకంగ ♦ అపుడు గణనాయకుఁడు
తండ్రియాజ్ఞకు తాను ♦ తప్పకుండఁగను।
తనతల్లిగౌరమ్మ ♦ తనవెంట నడువంగ
కాలినడకను వెళ్లె ♦ గణనాయకుండు।
నడువనేరని గౌరి ♦ నడువంగ వెడలెను
కష్టమెఱుఁగనిగౌరి ♦ కష్టింపదొడఁగె।
సారెసారెకుఁదారిఁ ♦ జతికలబడుచును
ఎంతగతివచ్చెహా ♦ యీశ్వరాయనుచు।
కాళ్లుపొక్కులుపొక్కి ♦ గడగడను వణకంగ
కొడుకుచెయ్యూఁతచే ♦ నడచుచుండెనుగా।
గంగతోనేల ♦ తర్కముఁబొందితి నటంచు
ఖిన్నురాలై మదిని ♦ చిన్నఁబోవుచును।
దిశలు భూములు సర్వ ♦ దేశంబులునుగడచి
దరిఁజేరె ఏలూరి ♦ పురప్రాంతమునను।
గౌరీమహాదేవి ♦ గణనాయకుఁడు వచ్చు
వార్తలే విన్నది ♦ వనితశ్రీగంగ।

గవని నాలుగుదార్లు ♦ కట్టించివేసెను
త్రోవలను వేయించె ♦ తుమ్మలకంప ।
కుప్పకుప్పలుగాను ♦ కుళ్లుచేపలపొలుసు
పఱపించె త్రోవలో ♦ తెలిపిలేకుండా ।
తెన్ను గనపడకుండ ♦ తెలిపిలేకుండంగ
పొలుసుమయమైయుండె ♦ పురముచుట్టుగను ।
ద్వారములవద్దను ♦ తగినకాపులఁబెట్టె
బలుభూతములవంటి ♦ బహుజనంబులను ।
తల్లిబిడ్డలు దారి ♦ తప్పకుండఁగవచ్చి
కన్నులనుగాంచిరా ♦ కడువింత లెల్ల ।
కడువింతలన్నియును ♦ కన్నులనుబాఁగగాంచి
గంగమాంబిక మహిమ ♦ గా యుంచుఁ దలఁచి ।
మనసు సహనము దాల్చి ♦ చనుదేరిచూడంగ
తుమ్మలకంపలు ♦ త్రోవడ్డమాయె ।
త్రోవతప్పించుకొని ♦ తొలఁగి చనుదేరంగ
కుళ్లుచేఁపలపొలుసు ♦ కొల్లలై యుండె ।
అందుకేమియు మనసు ♦ అఱమరలు చెందకను
చనుదెంచుచుండంగ ♦ తవకుముందఱను ।
గవనినాలుగుదార్లు ♦ కట్టియుండుటఁగాంచి
యేత్రోవ నీపురము ♦ కేతెంతుమనుచు ।

అచ్చోట నిలువఁబడి ♦ ఆతల్లి బిడ్డలు
ద్వారపాలకులను ♦ కోరిపిలిచిరిగా।
గంగమాంబిక సెలవు ♦ గాకుండ మిమ్ములను
రానియ్య మని పలికి ♦ రా ద్వారభటులు।
కైలాసగిరినుండి ♦ గౌరిగణనాయకుఁడు
తనుఁజూడవచ్చినా ♦ మని చెప్పుమనిరి।
నిలువుఁడిచ్చోటనని ♦ పలికి వేవేగమున
తప్పకుండఁగఁబోయి ♦ ద్వారపాలకులు।
గౌరమ్మరాకలు ♦ గణనాథురాకలు
వారువచ్చుటలు స ♦ ర్వంబు చెప్పిరిగా।
తలయూఁచి ముమ్మాఱు ♦ తర్కించి గౌరికి
గర్వపరిహారంబు ♦ గలిగెనా యనుచు।
మదిని యోచింపుచును ♦ మఱికొంత సేపుండి
గణనాథు నొకని ర ♦ మ్మని సెలవులోసఁగె।
తగగంగ సెలవంది ♦ ద్వారపాలకులేఁగి
వారితోఁజెప్పిరా ♦ వర్తమానంబు।
జననిగౌరమ్మన ♦ చ్చటనుండుమని చెప్పి
గంగ సన్నిధికేఁగె ♦ గణనాయకుండు।
గణనాయకునిఁజూచి ♦ గంగామహాదేవి
యెదురుగాఁజని కౌఁగి ♦ లించి వేడుకను।

అలరంగ నతని చె ♦ క్కిలిఁబట్టి ముద్దాడి
    చెలఁగున మోముపై ♦ చెమటంత తుడిచి।
పన్నీటితో నతని ♦ పాదములు గడిగించి
    కుదురైన గద్దెపై ♦ కూర్చుండఁ బెట్టి।
అతిదయారసమొప్ప ♦ అలసటంతయుఁదీఱ
    వింజామరలతోడ ♦ విసరించెనపుడు।
నాతండ్రి గణనాథ ♦ నన్ను గన్నాతండ్రి
    ఈవిధము కాల్నడక ♦ నేలవచ్చితివి।
నీతల్లి గౌరమ్మ ♦ నీతోడవచ్చెనఁట
    ఆమెవచ్చెడు పనులు ♦ ఏమి నాతండ్రి।
ఈ నీచుకొంపలకు ♦ ఏల తావచ్చెను
    వాసిగల కడుదొడ్డ ♦ వారింటిబిడ్డ।
పరువు మర్యాద లో ♦ పము చేసుకొనియిట్లు
    జాలరికొంపలకు ♦ ఏల తావచ్చె।
నీచుఇంటికివచ్చి ♦ నీచకాంతలతోడ
    కలసి వర్తించుటకు ♦ గౌరవ్వతగదు।
తగనిచోటుల కెల్ల ♦ తానురాకూడదని
    ఆమె నచ్చుటనుండు ♦ మంటిరా కొడుకా।
కంటకముపూని అ ♦ క్కడనుండు మన లేదు
    భావ్యమెఱుఁగనియట్టి ♦ పగమాటకాదు।

మఱల కొండకువచ్చి ♦ మసలరాదని నేను
ఆమెనచ్చటనుండు ♦ మంటిరా కొడుకా ।
కంటకపుమాటలిట్టు ♦ గంగ పలుకంగాను
గంగతోఁబల్కెను ♦ గణనాయకుండు ।
పదునాల్గులోకములు ♦ పావనము గావించు
తల్లివే నీవు మా ♦ తల్లి శ్రీగంగ ।
జీవనంబుల కెల్ల ♦ జీవనము నీవుగా
నీవల్లనున్నవి ♦ నిఖిలలోకములు ।
నీదయ లేకున్న ♦ నిముసంబులోపల
ఎల్లలోకములును ♦ తల్లడిల్లుచుగా ।
నీవిట్టితల్లివని ♦ నీగుఱుతు తెలియకను
చండిక నాతల్లి ♦ చలపెట్టెనిన్ను ।
జాలరిబిడ్డవని ♦ చక్కఁగానినుఁజూచి
సవతిపోరాడెను ♦ శర్వాణితల్లి ।
మొదలుగానఁగలేక ♦ ముదితగాభావించి
వర్ణమునుఁబట్టినిను ♦ పలుచఁజేసెనుగా ।
కల్లలాడినమాట ♦ లెల్ల మదిఁబెట్టుకొని
దానిపొంకముదించఁ ♦ బూనుకొంటివిగా ।
ఇంతినచ్చట చతా ♦ యించి నీ పుట్టింటి
కేతెంచితివి నీవు ♦ ఎల్లతర్కమున ।

గర్వపరిహారంబు ♦ గలిగించుటకు నీవు
ఎల్లలోకము నదులు ♦ ఇంకించినావు।
తనుబాంధుదూరమై ♦ జననిగౌరీదేవి
జలము లేమికి చాల ♦ అలమటించెనుగా।
సారెదిలోకములెల్ల ♦ శోధించిచూచినా
నీమహిమచే నెచట ♦ నీళ్లు లేవాయె।
తగుపీలెఱుంగు మా ♦ తండ్రితోఁజెప్పితే
ఆలించఁడాయెను ♦ పాలించఁడాయె।
తనవల్ల గాదంచు ♦ తానుపొమ్మనిచెప్ప
నీవె గతియనివచ్చి ♦ నిలిచె మాతల్లి।
అయిదుదినములనుండి ♦ యాహారమెఱుఁగదు
చెలఁగు శివార్చన ♦ సేయనే ప్రేమ।
నియమమగుసద్ధర్మ ♦ నిరతులే మఱచినది
శివపురాణశ్రవణ ♦ చింతవదలినది।
రామతారకమంత్ర ♦ రంజనలు మఱచినది
నిద్రతృష్ణాహార ♦ నియతిదప్పినది।
ననుఁదోడుదీసుకొని ♦ నినుఁజూడవచ్చినది
నీవె తల్లివియనుచు ♦ నీవెగతియనుచు।
ఆయమ్మచందమె ♦ ట్లయితేమి లోకములు
తల్లక్రిందైయుండె ♦ ధైర్యంబు తూలి।

ఆమెపై కోపమున ♦ అఖిల జగములకెల్ల
జలము లేమిం జేయ ♦ నిలువ శక్యంబా ।
కాలిమిలోపల అగ్ని ♦ గూడియు నుపాదింప
సమ్మెటపాలైన ♦ చందంబుగాను ।
అట్లు మీరిద్దఱు ♦ అతివైరములుపూన
రట్టడి గాదఁటే ♦ రాజీవనేత్ర ।
మీరు ఇద్దఱుగూడి ♦ పోరాడుచందమున
కలియుగము ప్రజలెల్ల ♦ కడగండ్లు పడిరి ।
గారమ్మ తర్కించి ♦ కాని మాటాడితే
జగతిలో ప్రజ లేమి ♦ సల్పిరే తల్లీ ।
అల్లకల్లోలమై ♦ తల్లడిల్లిరి ప్రజలు
నిలువఁజాలఁగ లేరు ♦ నిమిషంబు ఇఁకను ।
దయఁజూడు దయఁజూడు ♦ ధరణీతలం బెల్ల
నిలిపి రక్షించు మీఁక ♦ నిఖిలలోకములు ।
హాహాకారములయ్యె ♦ అఖిలరాజ్యంబులు
కరుణించు కరుణించు ♦ కాంత మాతల్లి ।
జలశూన్యమహిమచే ♦ జగతిలో ప్రజలెంత
బ్రహ్మాండ భాండంబు ♦ పట్టుకున్నదిగా ।
బింకమున తల్లులు ♦ బిడ్డలను జంపుట
యేకాలమున లేదు ♦ ఎంచిచూచినను ।

గౌరమ్మమీఁద నీ ♦ కసూ గలిగుంటేను
ప్రజ లేమి చేసిరే ♦ వణతి మాతల్లి।
నీయాజ్ఞ తప్పకను ♦ నిలిచియున్నది గౌరి
గవనివాకిటియందు ♦ కడు లజ్జఁగొనుచు।
కంటకములాడకను ♦ కరుణించు కరుణించు
దయఁజూడు దయఁజూడు ♦ తల్లి మాతల్లి।
నియతు లెన్నగవ స్తై ♦ నీకంటె పెద్దది
చెలఁగి భావించితే ♦ చెల్లెలవు నీవు।
మీకు భేదము లేదు ♦ మీరిద్దఱొక్కటి
ఒక దేవు భార్యలు ♦ ఓయమ్మమీరు।
తర్కబుద్ధులు మీకు ♦ తగదు తల్లులుమీరు
లోకముల కన్నిటికి ♦ లోకమాతలుగా।
లోకములు రక్షింప ♦ లోకములు పాలింప
మీరు కర్తలుగాన ♦ మీకు సాటెవరు।
మీరిద్దరొక్కటై ♦ మెలఁగియుండుట మంచి
మఱచిపోవలెను మీ ♦ పొరపాటులన్ని।
గవనివాకిటనిలిచి ♦ గౌరమ్మ యున్నది
రమ్మనక యుండు టది ♦ రమ్యమా నీకు।
దగ్గరకు వచ్చెనని ♦ యెగ్గులెంచఁగఁబోకు
కొంచెపఱచుట నీకు ♦ గొప్పగాదమ్మ!

పరఁగు కైలాసగిరి ♦ పట్టంపు దేవులు
అందఱిని రక్షించు ♦ అధికార్లు మీరు।
శివ వామభాగమున ♦ చెన్నారు గౌరమ్మ
శిరముమీఁదను నీవు ♦ చెలఁగుచుండుదువుగా।
శివుని దేహమునందుఁ ♦ జెందియుందురు మీరు
ప్రాణమొక్కటి మీకు ♦ పరమేశ్వరుండు।
అక్షీణ కరుణాక ♦ టాక్ష వీక్షణలచే
రక్షింపుదురు మీరు ♦ రాజ్యంబులన్ని।
గతసంగతులమీరు ♦ కలహించుటలు మాని
ఒక్కటై ప్రాణమై ♦ యుండుఁడీ యమ్మా।
గవనివాకిటయింత ♦ కాలమున్నది గౌరి
పదివేల శిక్షలు ♦ బైట నుంచుటలు।
కొమ్మ చెయిఁబట్టితో ♦ డ్కొని రమ్ము మాతల్లి
ఖిన్నురాలై జనని ♦ యున్నదచ్చోట।
అనుచు గణనాథుండు ♦ తనుబోధ పఱచంగ
చలమంతయును విడిచి ♦ జాలారిగంగ।
మాఱుమాటేమైన ♦ నోరఁ బలుకఁగ లేక
కొడుకు నప్పుడు ముందు ♦ కడువేగ లేపి।
కొడుకు చెయిపట్టి తో ♦ డ్కొనిపోయి వేగమున
గవనివాకిటనున్న ♦ గౌరమ్మఁజూచి।

కౌఁగిటను జేర్చుకొని ♦ కడుమన్ననలుచేసి
పాదపద్మములకు ♦ ప్రణమిల్లిలేచి।
సందిటను పార్వతిని ♦ చక్కఁగాఁ బట్టికొని
దయగల్గెనా నీకు ♦ తల్లిరో యనుచు।
తోడుకొని బంగారు ♦ తూఁగుటుయ్యేలమీఁద
కూర్చుండఁగాఁ బెట్టి ♦ కూర్మివెలయఁగను।
ఓయమ్మ గౌరమ్మ ♦ ఒక్కతెవు గణనాథుఁ
గూడివచ్చితివెందు ♦ కొఱకు ఇచ్చటికి।
హీనస్థలంబునకు ♦ ఏలాగువచ్చితివి
కాలినడకలవచ్చు ♦ కారణంబేమి।
కాలినడకలవచ్చు ♦ కారణంబేమమ్మ
పనియుంటె దాసీల ♦ పంపించరాదా।
నేనువచ్చేపనులు ♦ నీకుఁ గలిగుంటేను
నిలువఁగలనా ఒక్క ♦ నిమిషంబు నేను।
తగనిచోటికి ఇట్లు ♦ తయ్యారుపడి నడచి
రావచ్చునా నీవు ♦ రాణివాసివిగా।
ఎంతపనిచేసితివి ♦ మొగ్గులకు మూలంబు
నీవేఁగుదెంచుటకు ♦ నేనెంతగలను।
నీవు వర్ణపుబిడ్డ ♦ నీచుదానను నేను
ఇంచుమించెఱుఁగకి ♦ ల్లేలవచ్చితివి।

పంతమేటికి నాకు ♦ పసిబాల తెలియక
ఒట్టుపెట్టితినిరా ♦ నొప్పునే నీవు।
అని గంగ పలుకంగ ♦ అపుడు గౌరీదేవి
వనితచేతులు రెండు ♦ తనచేతఁబట్టి।
చెలియలా శ్రీగంగ ♦ జలములకు తల్లివి
నేను తెలియఁకపోతి ♦ నీమహాత్వంబు।
తలవంచుకొనివస్తి ♦ తప్పెంచకు నన్ను
పెద్దదానను నీవు ♦ పిన్నదానవుగా।
పిన్నదానవు నీవు ♦ పెద్దదానను నేను
కరుణించి నాతప్పు ♦ గడపవలె నీవు।
నీవున్నవద్దకు ♦ నే వచ్చి నిలిచితిని
నీవె యీకార్యంబు ♦ నెఱవేర్చవలెను।
ఆఱుదినములనుంచి ♦ యాహారమెఱుఁగను
చెలఁగి శివార్చన ♦ సేయనే లేదు।
ఎగ్గులెన్నుటకు నీ ♦ కిఁకను ధర్మముగాదు
నీ వెఱుఁగనిది లేదు ♦ నిఖిలపూతవుగా।
నేరమెన్నుట నీకు ♦ నియతిగా దోయమ్మ
మఱవవే నావలని ♦ పొరపాటులన్ని।
అని రెండుచేతులు ♦ అతివ పట్టుక నిలువ
చిఱునవ్వు నవ్వుచును ♦ శ్రీగంగమాంబ।

సందిటను పార్వతిని ♦ చక్కఁగాఁ బట్టుకొని
 కుందనపు గద్దెపై ♦ కూర్చుండఁబెట్టి।
నలుగుపెట్టుమటంచు ♦ సెలవిచ్చె దాసులకు
 నలువెప్ప దాదులు ♦ నలుగుఁబెట్టిరిగా।
పరిమళద్రవ్యములు ♦ పడఁతి యొంటను బూసి
 వలనొప్ప దాదులు ♦ నలుగుపెట్టిరిగా।
సంపంగినూనెయును ♦ జవ్వాదియును గూర్చి
 తలయంటి రప్పుడు ♦ ధవళలోచనలు।
సకియ శ్రీగంగ ఆ ♦ జ్ఞాప్రకారంబున
 పొంగి పారుచునుండె ♦ భూలోకనదులు।
సరయు గోదావరి ♦ జలములే తెచ్చిరి
 పసిఁడికుండలతోను ♦ భామలవ్వేళ।
కలశోదకము దెచ్చి ♦ కాంత గౌరమ్మను
 జలకమాడించిరి ♦ సకియలవ్వేళ।
జలకమాడినయట్టి ♦ వలువవిప్పఁగఁజేసి
 పట్టు పీతాంబరము ♦ గట్టించిరపుడు।
శుభవస్త్రములఁదెచ్చి ♦ సుదతి గౌరమ్మకు
 తడియొత్తి నెఱికలు ♦ తగనార్చిరపుడు।
గౌరప్ప తీరుగ ♦ గంగజలకములాడి
 యింతింత యనరాని ♦ సంతోషముననను।

అప్పచెల్లెంద్రు మది ♦ నఱమరలు లేకుండ
పరమసంతోషమునఁ ♦ బరఁగియుండిరిగా ।
శర్వాణి శ్రీగంగ ♦ సరణిగానుండుటకు
కడువేడ్కఁ జెన్నొందె ♦ గణనాయకుండు ।
గణపతిని దోడుకొని ♦ గౌరమ్మవచ్చిన
చందంబు విన్నాఁడు ♦ శంకుదేవయ్య ।
సంతోషభరితుఁడై ♦ చదురు గొబ్బున లేచి
అంతఃపురంబులో ♦ కరుదెంచిరపుడు ।
రత్నాలపీఠమున ♦ రంజిల్లుచున్నట్టి
గణపతిని పూజించి ♦ గౌరవముచేసి ।
గౌరమ్మపాదములు ♦ కడుభక్తితో మ్రొక్కి
బహువిధంబులచేత ♦ ప్రార్థనలుచేసి ।
కరయుగంబులుమోడ్చి ♦ శిరముపైఁబెట్టుకొని
పలికె గౌరమ్మతో ♦ పరమభక్తిగను ।
ముల్లోకములకెల్ల ♦ మూలమగు తల్లివి
లోకముల రక్షింప ♦ లోకమాతవుగా ।
హిమశైలనందనివి ♦ ఈశ్వరుని రాణివి
భక్తకల్యాణివి ♦ భక్తరక్షిణివి ।
రామతారకమంత్ర ♦ రంజనవాణివి
పుణ్యసంసారవు ♦ పూజనీయవుగా ।

పరఁగు కైలాసగిరి ♦ పట్టంపుదేవివి
కన్నతల్లివి లోక ♦ కర్తవంతటికి।
భవదీయకృపనన్ను ♦ పాలించవచ్చితివి
ధన్యుండనైతిని ♦ పుణ్యుండనైతి।
పరఁగంగ నాగృహము ♦ పావనము పొందుటకు
నీవు వేంచేస్తివే ♦ నెలఁతమాతల్లీ।
కాదువలే దిఁకనాకు ♦ కోటిభాగ్యమ్ములు
సంపదలు చేకూరు ♦ జయము సిద్ధించు।
ని సుతులు ఇద్దఱు ♦ నేను మూఁడవవాఁడ
పుత్రవాత్సల్యమున ♦ పోషించు నన్ను।
పసిబాల శ్రీగంగ ♦ పడుచుతనమేకాని
ఎఱుఁగదే చందంబు ♦ ఎంతమాత్రంబు।
వెలఁదిపట్టినపట్టు ♦ విడుఁవదే మాటకును
చెలియ ముద్దిట మేము ♦ చెల్లించినాము।
తనయ కిటమీఁదను ♦ తల్లితండ్రివి నీవె
దాతవును నేతవును ♦ దైవంబు నీవె।
నేరమెంచినవేళ ♦ నీవు కాపాడవలె
నాబిడ్డకాదమ్మ ♦ నీబిడ్డ సుమ్మి।
కైలాసగిరినుండి ♦ కదలి యొక్కతె వచ్చె
మనసు అనుమానంబు ♦ గొనెనమ్మ మాకు।

ఒంటిగా వస్తివే ♦ మంటేను మిమ్ములను
చూడవచ్చితిననుచు ♦ సుదతి బొంకెనుగా।
అదివచ్చి నడుగులను ♦ అతివ నీవచ్చుటను
అలిగి వచ్చుట నిజం ♦ బని బోధప డెను।
ఎవరిపై అలిగనో ♦ యేర్పాటు తెలియదు
తెలియఁజెప్పవె తల్లి ♦ తేట తెల్లముగా।
మాటకయ్యామారి ♦ మగువ గంగకుమారి
భామ కోయతనంబు ♦ మేమెఱుంగుదుము।
అలిగివచ్చినమాట ♦ ఆత్మలోఁబెట్టకను
కన్నబిడ్డవిధాన ♦ కరుణించు తల్లి।
అభయహస్తంబిచ్చి ♦ ఆదరించినఁగాని
పొందుగా నామనసు ♦ బోధపడదమ్మా।
మాయధారీహరుఁడు ♦ మటుమాయచే వచ్చి
మరులుకొల్పెను దీని ♦ విరహామార్గమున।
విరహామార్గము ఇంతి ♦ చరియించుచుంటేను
గదిమితిమి ఉన్న సం ♦ గతు తెల్లఁ దెలిపి।
నీమీఁద నిచ్చుటకు ♦ మేము సైఁపకయుండ
పరమ మునీంద్రులను ♦ పంపించె శివుఁడు।
పరమ మానులు వచ్చి ♦ పలు విధంబుల మమ్ము
బోధపఱచిరి పువ్వు ♦ బోణి నిమ్మనుచు।

సన్నుల మాటలకు ♦ జవదాఁటగా లేక
　　హరుని ఆజ్ఞకు తప్ప ♦ నలవిగా లేక ।
అనలాక్షుఁ డీశ్వరుం ♦ డని మేము భయపడుచు
　　ఇచ్చితిమి గంగను ♦ ఈశ్వరేశునకు ।
సవతిమీఁదను బ్రతుకు ♦ చందంబుగాదని
　　యెఱిఁగి తేనేమి మే ♦ మెఱుఁగ కుంటేమి ।
శంకరుని కోపముకు ♦ జడిసి నీ మీఁదను
　　బిడ్డనియ్యఁగవచ్చె ♦ బేరంబులేల ।
లోకముల కన్నిటికి ♦ లోకమాతవు నీవు
　　గలిగియుండుట మాకు ♦ తెలియదా తల్లీ ।
తెలిసియిచ్చితి మమ్మ ♦ తేటగా బిడ్డను
　　చపలచిత్తుండు శ్రీ ♦ త్రిపురాంతకుండు ।
కోరి యిచ్చుట లేదు ♦ కోరవచ్చుట లేదు
　　బ్రహ్మవ్రాలీరీతి ♦ పరఁగియున్నదిగా ।
మాయధారీ హరుఁడు ♦ మనులు కొల్పెనుగాని
　　వలచి వచ్చుట లేదు ♦ వనిత శ్రీగంగ ।
తప్పేమిచేసినా ♦ ఒప్పేమిచేసినా
　　నీతోడఁబుట్టువిఁక ♦ నెలఁత శ్రీగంగ ।
నీతోడఁబుట్టువును ♦ నీవు రక్షించవలె
　　రక్షించవే మమ్ము ♦ రాజ్యంబులోను ।

లోకములు పుట్టింప ♦ లోకములు రక్షింప
లోకములు అణగింప ♦ లోకమాతవుగా।
పరిపూర్ణకరుణతో ♦ పాలించి ప్రోతునని
తలమీఁద నీచెయ్యి ♦ తగునమ్మ చెప్ప।
తలమీఁద నిచెయ్యి ♦ తగఁజెప్పి వేగమున
తోడుకొనిపొమ్మనీ ♦ తోడఁబుట్టువును
అని శంకుదేవయ్య ♦ వనిత గౌరీదేవి
పదపద్మములపైన ♦ ప్రణమిల్లియుండె।
ప్రణమిల్లియున్న సతి ♦ పతుల నిద్దఱి నపుడు
కరుణాకటాక్ష వీ ♦ క్షణములు మెఱయ।
వారి చేతులుపట్టి ♦ పైకి లేవఁగనెత్తి
ఈరీతిఁ బల్కెను ♦ ఇంతి గౌరమ్మ।
శంకుదేవయ్యనీ ♦ సత్య సంపన్నత
వెలయ లోకములందు ♦ విఖ్యాతమయ్యె।
పెట్టు పోతలయందు ♦ పేరైనవాఁడవు
గంగను నన్నొక్క ♦ కరణిని జూడు।
మేలైన తన కలిమి ♦ మిన్నంది యుండినా
పుట్టింటిపై ఆశ ♦ పోదు ఇంతులకు।
ఒకదేవు భార్యలము ♦ ఒనర మేమిద్దరము
అప్పచెల్లెండ్రము మా ♦ కఱమరలు లేవు।

గంగామహాదేవి ♦ కన్నతండ్రివి నీవు
పుణ్యాత్ముఁడవు లోక ♦ పూజనీయుఁడవు ।
చేడె గంగాదేవి ♦ తోడఁబుట్టువు నాకు
జనక భావము నీవు ♦ శంకుదేవయ్య ।
గంగనెన్నినవారికి ♦ గతులు లేవెన్నటికి
భూలోకపావని ♦ పుణ్యసంచారి ।
గంగతో నెవరు త ♦ ర్కము పొంది నిలిచేరు
పరఁగు లోకము ప్రాఁత ♦ పదమైన గంగ ।
గంగ మాహాత్మ్యంబు ♦ కనఁజాల లేకను
అల్పబుద్ధిని నేను ♦ అనుభవించితిని ।
గంగ నెవ్వరుఁ బాయఁ ♦ గాలేరు పుడమిలో
జీవనంబులకెల్ల ♦ జీవనము గంగ ।
యుగములో నాజీవ ♦ మున్నంత మట్టుకు
గంగతోడుత కలహ ♦ గతి నేను బోను ।
సంశయంబిఁక లేదు ♦ శంభు మహాదేవుని
పదపద్మముల సాక్షి ♦ పైమాట లేల ।
మనసాకలై నేను ♦ మనవలెను గంగతో
కలనైన తప్పను ♦ కరకంఠు సాక్షి ।
తప్పనెన్నటికనుచు ♦ తలమీఁద చెయిఁ బెట్టి
బాస లొనరించెనా ♦ పార్వతీదేవి ।

పార్వతీదేవిట్లు ♦ బాసచేయుటఁ జూచి
తాను వేగను లేచి ♦ తరుణి శ్రీగంగ।
శంకరుదేవయ్య ఆ ♦ జ్ఞాప్రకారంబుగా
గౌరమ్మ పాదములు ♦ కరములును బట్టి।
నెలఁతరో గౌరప్ప ♦ నీ పాదములసాక్షి
తల్లిదండ్రివి నీవె ♦ దైవంబు నీవె।
నిదుర కలలో నైన ♦ నీకెదురు చెప్పను
నీ ఆజ్ఞ తప్పను ♦ నినుఁ బాసిపోను।
నిజముగా ఈమాట ♦ నిక్కంబు నిక్కంబు
పరమేశ్వరుని పాద ♦ పద్మంబు సాక్షి।
నీలకంఠుని సాక్షి ♦ నీసాక్షి నిజముగా
నమ్మ నమ్మ మటంచు ♦ నమ్మకము చేసి।
భేదమేమియు లేక ♦ బిడ్డగతి నుందునని
నమ్మమని శ్రీగంగ ♦ నమ్మకముచేసి।
నమ్మకంబులుచేసి ♦ నాతు లిద్దరు లేచి
పరంగంగ బంగారు ♦ పళ్లెరంబులను।
పంచ భక్ష్యాన్నములు ♦ బంతిగాఁ గూర్చుండి
ఆరగింపులు చేసి ♦ రానందమునను।
ముద్దపప్పులు నేయి ♦ ముదమైన ఉండ్రాళ్లు
తేనె అమృతాన్నంబు ♦ లియ్యారటి పండ్లు।

ఆరగింపులు చేసె ♦ ఆతల్లులను గూడి
ఘన పదార్థములెల్ల ♦ గణనాయకుండు।
కన్నతల్లులు తాను ♦ కరయుగంబులు గడిగి
అలర కర్పూర వీ ♦ డ్యములు చేసిరిగా।
కలఁతలేమియు లేక ♦ గౌరమ్మ గంగమ్మ
ఒకతల్లి బిడ్డలుగ ♦ నొప్పుచుండిరిగా।
ఒకవేళను ప్రసంగ ♦ మొకవేళ సంగీత
మొకరీతి నానంద ♦ మొందు చుండిరిగా।
సవతి పోరన్నదే ♦ జాడ లేకుండంగ
ఇద్ద ఱొక్క విధాన ♦ నెసఁగు చుండిరిగా।
తల్లులొక్క విధాన ♦ తనరి యుండుటఁ జూచి
కడు వేడుకను బొందె ♦ గణనాయకుండు।
కలహమే కాలముకుఁ ♦ గలుగ దిద్దఱికనుచు
సంతోషమును జెందె ♦ శంకు దేవయ్య।
షడ్రసోపేతాన్న ♦ సౌఖ్యమ్ము నందుచు
తల్లిబిడ్డలు వేడ్కఁ ♦ దనరి యుండిరిగా।
జాలరి గృహమన్న ♦ సంశయము లేకుండ
అయిదురోజులు నిలయ ♦ మైయుండి రచట।
ఇన్ని దినములు రాని - హేతు వేమో యనుచు
ప్రమథగణముల నంపె ♦ పరమేశ్వరుండు।

పరమేశ్వరుఁ డంపిన ♦ ప్రమథగణముఁజూచి
జాలరి కులజుండు ♦ శంకుదేవయ్య।
విలువసేయఁగరాని ♦ వెయ్యాన వేలు తా
తెప్పించె వేగమున ♦ దివ్యాంబరములు।
ఏడు వారములకు ♦ ఏడు తొడుగుల నగలు
పసుపు కుంకుమ పండ్లు ♦ పదియాఱు వేలు।
వజ్రములు మేలైన ♦ వైడూర్యములు మంచి
గోమేధికంబులు ♦ గొప్ప ముత్యములు।
మరకతంబులు మేలు ♦ మాణిక్యములు పుష్య
రాగ ప్రవాళములు ♦ రజత హేమములు।
పసుపు కుంకుమ పండ్లు ♦ పదియాఱు వేలతో
పదిబండ్లుగాఁ గూర్చి ♦ పంపించె నపుడు।
శ్రీవెలయు పార్వతీ ♦ దేవి కిచ్చినరీతి
దివ్యభూషణములు ♦ దివ్యాంబరములు।
పసుపు కుంకుమ పండ్లు ♦ పరఁగు నవరత్నములు
గౌరమ్మరీతిని ♦ గంగ కిచ్చెనుగా।
పరఁగంగ ఇద్దఱికి ♦ పంచిపెట్టినరీతి
ఎచ్చు తగ్గనకుండ ♦ ఇచ్చె భాగ్యములు।
పటిక బెల్లము నెయ్యి ♦ పప్పు కొబ్బెర పండ్లు
తేనె శర్కర జున్ను ♦ తియ్యరఁటిపండ్లు।

చంద్రకాంతలు కండ ♦ చక్కెరలు మీఁగడ
వేయు బండ్లం పెను ♦ విఘ్నేశ్వరునకు।
తగిన బహుమానంబు ♦ తెగువతోడుతఁ జేసి
కర మొప్ప గణపతిని ♦ కౌఁగిలిని జేర్చి।
నీ తల్లులను గూడి ♦ నీవు వేంచేయుమని
పలుమాఱు గణపతిని ♦ పట్టి ముద్దాడి।
తగు విమానంబిచ్చి ♦ తర్లుమీ యని పల్కి
అతనితో సెలవంది ♦ ఆనందుఁడగుచు।
గౌరమ్మ చేతిలో ♦ గంగమ్మ చెయిఁబెట్టి
తల్లి నీభారమని ♦ యిల్లడలు పెట్టి।
రత్నఖచితంబుగా ♦ రంజిల్లు బంగారు
పల్లకి తెప్పించి ♦ బాగు మీఱఁగను।
కోమరొప్ప ఇద్దఱిని ♦ కూర్చుండఁగాఁ బెట్టి
చను దెంచుమని చెప్పె ♦ శంకుదేవయ్య।
అయిదు క్రోసుల మేర ♦ అంపకము చేసెను
సతిపతు లిద్దఱును ♦ జాల ర్లతోడ।
పార్వతీదేవి పద ♦ పద్మములు ప్రణమిల్లి
దయయుంచుమని వేఁడి ♦ దండములు పెట్టి।
సెలవందుకొని సాటి ♦ జాల ర్లతోఁగూడి
ఏలూరి పట్నంబు ♦ కేఁగి రవ్వోళ।

గణనాయకుండును ♦ గౌరమ్మ గంగమ్మ
దివ్యవిమానముల ♦ తేజరిల్లుచును।

---

గంగా పార్వతులు శివునివద్దికిఁబోవుట.

ప్రమథగణములు వెంటఁ ♦ బఱచి సేవింపంగ
రజతాద్రి కేఁగిరి ♦ రమ్యమార్గమున।
గౌరీమహాదేవి ♦ గంగామహాదేవి
అంతఃపురంబులో ♦ కరిగి రవ్వేళ।
గణనాథుఁ డొక్కఁడు ♦ తన తండ్రిగారికి
వినిపించె నిచ్చోటి ♦ వృత్తాంతమెల్ల।
సుతుఁడు చెప్పినయట్టి ♦ చోద్యంబులకు మహా
సంతోషమును బొందె ♦ శంభుదేవుండు।
చిఱునవ్వు మోముతో ♦ శ్రీ మహాదేవుండు
అంతః పురంబులో ♦ కరుదెంచె నపుడు।
అల్లంతటను జూచి ♦ ఆదేవు లిద్దఱు
వచ్చి పదములపైన ♦ వ్రాలియుండిరిగా।
పాదములపైఁ బడ్డ ♦ భామలను పైకెత్తి
వర్ధిల్లుఁ డనుచు దీ ♦ వన యిచ్చి యపుడు।
వాద భేదము లేక ♦ వాసిగా నుండుఁడని
వారితో సెలవిచ్చి ♦ గౌరీశ్వరుండు।

వారలను తోడుకొని ♦ వైభవము మీఱుచును
హంసతూలిక శయ్య ♦ నమరియుండెనుగా।
పూలపానుపునందు ♦ పురహరుండును సతులు
సరస సల్లాపములు ♦ సలుపుచుండిరిగా।
భోగరాగంబులను ♦ పొలుపారుచుండిరి
దివ్యకీర్తిని కడు ♦ తేజరిల్లుచును।
గౌరమ్మ గంగమ్మ ♦ కలహములు లేకుంట
ఆనందమును జెందె ♦ నఖిలలోకంబు॥

---

గ్రంథ ఫలము.

ఈ గంగ కల్యాణ ♦ మేయూరనుండినా
నెల మూఁడు వర్షములు ♦ నిండారఁ గలుగు
ఈ గంగ కల్యాణ ♦ మెవ్వరైన భక్తితో
వ్రాయువారికిఁ గల్గు ♦ వైభవోన్నతులు।
ఈ గంగ కల్యాణ ♦ మెవరు భక్తిగవిన్న
కలుగు భాగ్యంబులు ♦ కడకు మోక్షములు।
అనుచు గాంగేయుండు ♦ అర్జునునితోఁ జెప్పె
సాకల్యముగను ఈ ♦ చారిత్ర మంత।
ఆటలందుననైన ♦ పాటలందుననైన
పరఁగు హరిహర కథలు ♦ పాపహరణములు।

ఏకథలు హరిహరుల ♦ వృత్తాంతములు తెల్పు
ఆకథలు పుణ్యకథ ♦ లవి దోషహరులు।
కలదు జీవన్ముక్తి ♦ కడు భోగభాగ్యములు
సకల సుఖములు గల్గు ♦ సర్వజీవులకు।
పనస జంబూద్రాక్ష ♦ ఫల రసంబులకన్న
మధురంబు హరిహరుల ♦ కథలందుఁ గలదు।
ఇంత మధురంబైన ♦ దేవదార్ధము లేదు
హరిహరాదుల కథలు ♦ అధిక మధురములు।
శ్రీ అయోధ్యాపురిని ♦ శ్రేష్ఠుఁడై వెలకొన్న
రమణీయమైన శ్రీ ♦ రఘురామ పేర।
తాటకిని పరిమార్చి ♦ దైత్యకోటులఁ గూల్చి
క్రతువు నిల్పినయట్టి ♦ కమలాక్షు పేర।
తండ్రి సెలవున జనక ♦ తనయ లక్ష్మణులతో
వననిధి కేఁగిన ♦ ఘనరాము పేర।
జనకాత్మజను చెఱలు ♦ గొనిన రావణుఁద్రుంప
రవి పుత్రహితుఁడైన ♦ రఘు రాము పేర।
ఒక్కశరమున వాలి ♦ నుక్కణచి వారిధిని
బంధించు శ్రీరామ ♦ చంద్రుని పేర।
దశకంఠుఁ డాదిగా ♦ దానవానీకముల
భండనంబునఁ గూల్చు ♦ పరమాత్ము పేర।

ప్రేమతో పట్టాభి ♦ రామభద్రుని పేర
పదిలముగ ఈ చరిత ♦ పాట పాడితిని।
ఆ చంద్ర తారార్క ♦ మగుచు ఈచరితమ్ము
విలసిల్లఁగా వలయు ♦ విశ్వంబులోన।
పద్మసాలెకులుండు ♦ పసగాని సన్యాసి
పదిలముగ ఈచరిత ♦ పాట గావించె।
సరణిగా నలనామ ♦ సంవత్సరాశ్వయుజ
బహుళ పంచమి సరికి ♦ పరిపూర్ణమయ్యె।
మరువాడ పురమందు ♦ మహిమతో విలసిల్లె
ఈ గంగ కల్యాణ ♦ మెలమి మీఱుచును.

శ్రీ శ్రీ శ్రీ

---

గంగా వివాహము సంపూర్ణము

---



శ్రీరస్తు.

# చెంచితకథ.

శ్రీ రమాధిపుఁడైన ♦ శ్రీ కృష్ణమూర్తి యా

ద్వారకాపురిలోన నుండంగా

ద్వారావతీపురిలో నుండంగా।

ద్వారకా పురిలోన ♦ క్షీరనీరధి కన్య

మొదలుగాఁ గల యష్టభార్యాలెల్లా

సత్యభామా మొదలు భార్యాలెల్లా।

మోదంబుతోనుండ ♦ యాదవాంబుధి సోముఁ

డాదరంబున వారి నందాజేసీ

సంతోష మొప్పంగ నందాజేసీ

మోద మిగురొత్తంగ నందాజేసీ।

చాల సొమ్ములు పెట్టి ♦ వేల చీరలు నిచ్చి

కేళిలోలుండయ్యె ♦ వారలానూ

చాల సంతోషమున వారలానూ

మోద మందింపుచును వారలానూ।

సంతోషపెట్టంగ ♦ సత్యభామా మొదలు
కాంతలెల్లను మదిని గర్వించీ - శ్రీ -
కాంతునితో మాటాడ చాలించీ - శ్రీ -
కృష్ణునితో మాటలూ చాలించీ।

గర్వించి యుండంగ ♦ కంజలోచనుఁ డపుడు
కాంతామణులఁ జూచి కోపామునా - వారి -
గర్వమడఁపఁ దలఁచె కోపామునా - వారి -
దర్పమడఁపఁ దలఁచె కోపామునా ॥

*  *  *  *

కృష్ణుఁడు.

మీరింత గర్వించ ♦ మీకంటె హెచ్చయిన
వారిజాస్యల కోరి తెచ్చెనే
చాల సొమ్ములు చీరె లిచ్చెనే
మేలైన సంపదలు నిచ్చెనే ॥

చెంచిత.

మాకంటె హెచ్చయిన ♦ వారిజాస్యల నీవు
తేలేవు తేలేవు కృష్ణూఁడా - నీవు -
తెస్తేను చూతాము కృష్ణూఁడా - నీవు -
తేవోయి చూతాము నాసామీ ॥

కృష్ణుఁడు.

చూడండి చూడండి ♦ సుదతులారా మీ
సుందరము చూతాము భామలారా మీ
చక్కనా చూతాము భామలారా మీ
సొంపైన చూతాము సుదతులారా ।

భార్యలు

[☞ 176 - పేజీలోకూడ భార్యలే - చెంచితకాదు.]

మాకంటె సుందరులు ♦ లోకాములో లేరు
లోకేశ నీవెఱుఁగ వఁటవోయీ
భూతేశ నీవెఱుఁగ వఁటవోయీ
సర్వేశ నీవెఱుఁగ వఁటవోయీ ॥ * * *

---

ఈరీతి వనితలా ♦ వారిజాక్షునితోడ
కోరి వేడుక వాద ♦ మాడూచుండా
మీఁటి సంవాదంబు సేయూచుండా
హరితోడ సంవాద మాడూచుండా ।
వారిజాక్షుం డపుడు ♦ వనవిహారము సేయ
కోరి ద్వారక వెడలి మోదామునా
చాల భార్యలతోడి వాదామునా ।
వేటాడ వేడుకను ♦ అటవికిఁ బోఁగాను
బూటకములేని మృగములఁ గాంచి - అట్టి -

వట్టి మృగముల వేట దాఁటించీ - వాటి -
యంగములు తూటులుగఁ గావించీ ।
చమరీమృగాదులు సృ ♦ గాలమృగములగుంపు
భ్రమఁజెందునట్లుగా బెదురూపఱచీ - వాటి -
తిమురడఁచి గుంపులను తెరలాఁజేసీ ।
భల్లూకముల మేన ♦ బల్లెములు నాఁగ్గసి
కొల్లగా నాటించి త్రెళ్లావైచీ - వాటి -
ఒళ్లెల్ల రక్తాము లోలుకాఁజేసీ - వాటి -
మేనెల్ల రుధిరాము గ్రమ్మాఁజేసీ ।
వనజాక్షుఁడీరీతి ♦ వనవిహారము సల్పి
కనెనొక్కపొదలోన కమలాముఖిని - దాని -
కన్నులా సొబగెల్లఁ గనె నప్పుడూ - దాని -
సొమ్ము సంపదలెల్లఁ జూచె నపుడూ ।
నెలఁబోలు నెమ్మోము ♦ తళుకైన చెక్కిళ్లు
కులుకుగుబ్బల చెంచు వెలఁదీగాంచీ - దాని -
వలపుచేతను మేను పులకారించీ - దాని
కాంతిచేతను మనము భ్రాంతీచెందీ ।
చెంచువేషముఁ బూని ♦ పొంచిపొంచీ డాసి
చెంచుమాటల దాన్ని చేరాఁదీసె
మంచిమాటల దాన్ని మనవిచేసె ॥

కృష్ణుఁడు.

ఎఱ్ఱనల్లాటిండ్ల ♦ యేసాల వగలాడి
నావంకచూడవే చెంచీతా
మోమెత్తి ననుఁజూడు చెంచీతా
మోమాట ముంచవే చెంచీతా।

పచ్చనల్లాటిండ్ల ♦ పారుటాకులచీర
పాపా యేవూరి దానావే
పణతిరో యేవూరి దానావే
చెంచితా యేవూరి దానావే
చెడెరో యేవూరి దానావే॥

చెంచిత

ఏవూరు అయితేను ♦ మాజోలి మీకేల
వేటకొచ్చినాము పోవోయీ
అడివేటకొచ్చేము పోవోయి
దుప్పేటకొచ్చేము పోవోయీ॥

కృష్ణుఁడు.

వేటకొచ్చితేను ♦ ఏమాయె చెంచీత
మాటలాడితేను కోపామా
ముచ్చటాడితేను కోపామా
పల్కుపల్కితేను కోపామా॥

చెంచిత

మాటల్ మచ్చికాల్ • మాకేమి సరిపడదు
మఱియేమిరా దగ్గరొచ్చేవు
మగవాఁడ యేమిరా వచ్చేవు
అదియేమిరా దగ్గరొచ్చేవు ॥

కృష్ణుఁడు.

శ్రీకృష్ణమూర్తినే చెంచీతా
లోకాలకర్తనే చెంచీతా
రాధరుక్మిణికన్న చెంచీతా
చక్కానిదానవని చెంచీతా
కోరివచ్చితి నేను చెంచీతా - నీ -
మక్కువలఁబడ్డాను చెంచీతా
స్త్రీలులేకనునేను చెంచీతా
చింతపడిరాలేదు చెంచీతా
పదియాఱువేలేమి చెంచితా
గోపికాస్త్రీలేమి చెంచీతా
అష్టభార్యాలేమి చెంచీతా
ఇష్టముగనున్నారు చెంచీతా
వారితోడను నేను చెంచీతా
చేరి విహారిస్తునే చెంచీతా

వాదాడివస్తినే చెంచీతా
భేదమెంచాఁబోకు చెంచీతా
మ్రొక్కేను మ్రొక్కేను చెంచీతా
మ్రొక్కుచెల్లించవే చెంచీతా
నీపుణ్యముంటుంది చెంచీతా
నన్నుపెండ్లాడవే చెంచీతా ॥

చెంచిత.

పోవయ్య పోవయ్య కృష్ణూఁడా - నీకు -
ప్రొద్దేలపోదయ్య నాసామీ
మాయన్న లొచ్చేరు కృష్ణూఁడా
అంబులే తెచ్చేరు నాసామీ
అలుగులే వేసేరు నాసామీ ॥

కృష్ణుఁడు.

ఏవూరికమ్మారి ♦ చేసినాఁడే భామ
నీచేతి అలుగులూ చూచేనే
నేచేతి అంబులూ చూచేనే ॥

చెంచిత.

గూడేము కమ్మారి ♦ చేసినాఁడుర వ్రొారి
గుండేలిప్పుడు తెగవైతూనురా - నీ -
కండాలుఖండించి వైతూనురా ॥

కృష్ణుఁడు.

గుండేల్ వేసినా ♦ గుజ్జుచేతూలాకు
కమ్మాల్ కడియా లిచ్చేనే
కనకంపు బావిలీ లిచ్చేనే
మేలైనసొమ్మూ లిచ్చేనే
మేడమీఁదా నిన్ను వుంచేనే
ఏడుకోట్లాధనము యిచ్చేనే
బహుపుణ్యముంటుంది చెంచీతా
నన్ను పెండ్లాడవే చెంచీతా ॥

చెంచిత.

ఏడూగూడెముఁలాలో ♦ యెన్నంగ కొలఁదైన
ఎలుపోతురెడ్డీ కూఁతురినీ
ఏడుగురు అన్నలూ గలదాన్ని
ఏడుగురు వదినెలూ గలదాన్ని
పోవయ్య పోవయ్య కృష్ణూఁడా - నీకు -
ప్రొద్దెలపోదయ్య నాసామీ ॥

కృష్ణుఁడు.

ఎలుపోతురెడ్డీ ♦ కూఁతురూవైతేను - నాకు
వెతకనేలా మామగావాలెనే
మేనరికమున్నదే చెంచీతా

బంధుత్వమున్నదే చెంచీతా
చుట్టరికమున్నదే చెంచీతా
కలసిమెలసుందాము చెంచీతా
బహుపుణ్యముంటుంది చెంచీతా
నన్ను పెండ్లాడవే చెంచీతా ॥

చెంచిత.

పాన్పుపై పవళింప కృష్ణూఁడా - నిన్ను -
పామైన పెరకదా నాసామీ - నిన్ను -
తేలైన చెనకదా నాసామీ
పోవయ్య పోవయ్య కృష్ణూఁడా - నీకు -
ప్రొద్దేల పోదోయి నాసామీ ॥

కృష్ణుఁడు.

తిట్టకే తిట్టకే చెంచీతా - నీవు -
తిట్టినా తిట్లెల్ల చెంచీతా
అంబులై నాటేను చెంచీతా
అలుగులై నాటేను చెంచీతా
తల్లికీ ఒక్కఁడనె చెంచీతా
తండ్రికీ ఒక్కఁడనె చెంచీతా
బహుపుణ్యముంటుంది చెంచీతా
నన్ను పెండ్లాడవే చెంచీతా ॥

చెంచిత.

నీవు పుట్టినపుడు కృష్ణూఁడా - నీకు -
సంద్దైన కొట్టదా కృష్ణూఁడా
పోవ్వూయి పోవ్వూయి కృష్ణూఁడా - నీకు
ప్రొద్దేల పోదోయి నాసామీ ॥

కృష్ణుఁడు

మేనత్త కూఁతురే చెంచీతా - మనకు -
మేనరికమున్నదే చెంచీతా
బంధుత్వామున్నదే చెంచీతా
చుట్టరికమున్నదే చెంచీతా - నీ -
పాదాలుపట్టేనె చెంచీతా - నీకు -
పనులెల్ల చేసేనె చెంచీతా
అడవిలోకొచ్చేనె చెంచీతా - యింక -
తడ వేల చేసేవె చెంచీతా
నాకు ఎవ్వారులేరు చెంచీతా
నీకు పుణ్యాము కద్దు చెంచీతా
ఈకోనలో మనము చెంచీతా
ఏకమై యుందాము చెంచీతా
బహుపుణ్యా ముంటుంది చెంచీతా
నన్ను పెండ్లాడవే చెంచీతా ॥

చెంచిత

పెదపెద్ద పామూంల్ పెం జేరి గున్నాల్
కొండచిలువల్ రెండు చూచీతివా
గండీకొచ్చినజాడ లెఱుగూదువా
అనువులున్నా తావు లెఱుఁగూదువా
అనుమానముండేది యెఱుఁగూదువా
పోవయ్య పోవయ్య కృష్ణూఁడా - నీకు -
ప్రొద్దేల పోదోయి నాసామిా ॥

కృష్ణుఁడు.

పెదపెద్ద పామూల్ - పెం జేరి గున్నాల్
కొండ చిలువల్ రెండు చూచీతినే
గండీకొచ్చిన జాడ లెఱుఁగూదునే
అనువులున్నా తావు లెఱుఁగూదునే
అనుమానమున్నదీ యెఱుఁగూదునే
బహుపున్నెముంటుంది చెంచీతా
నన్ను పెండ్లాడవే చెంచీతా ॥

చెంచిత.

నిమ్మాలాగిరిమిాద - నమ్మాకా తిరిగేటీ
కొమ్ములా గురుపోతు నేసేవా
ఏదూపందుల నేయ నేరూతువా

అడవీదుప్పుల నేయ నేరూతువా
అనువులున్నా జాడ లెఱుఁగూదువా
పుట్ట తేనెలుపట్ట ♦ నేరూతువా
పోవయ్యా పోవయ్యా కృష్ణూఁడా - నీకు -
ప్రొద్దేల పోదయ్యా నాసామీ ॥

కృష్ణుఁడు,

నిమ్మాలగిరిమీద ♦ నమ్మాక తిరిగేటి
కొమ్మూలగురుపోతు నేసేనే
ఏదూపందుల నేయ నేరూతునే
అడవీదుప్పుల నెయ్యా నేరూతునే
అనువూలున్నా జాడ లెఱుఁగూదునే
పుట్ట తేనెలుపట్టా నేరూతునే
బహుపుణ్యా ముంటుంది చెంచీతా
నన్ను పెండ్లాడవే చెంచీతా ॥

చెంచిత.

గోరునో వ్వాకుండ ♦ గొడ్డ కేరీమీద
జీడిపప్పులు చేయ నేరూతువా
ఇప్పపువ్వూ లేర నేరూతువా
టెంకెపువ్వులుచేయ నేరూతువా
మల్లెపువ్వూ లేర నేరూతువా

పోవయ్యా పోవయ్యా కృష్ణూఁడా - నీకు -
ప్రొద్దేల పోదోయి నాసామీ ॥

కృష్ణుఁడు.

గోరునావ్వాకుండ ♦ గొడ్డశేరీమీద
జీడిపప్పాలు సేయ నేరూతునే
ఇప్పపువ్వూ లేర నేరూతునే
ఓంకెపువ్వులు సేయ నేరూతునే
మల్లెపువ్వూ లేర నేరూతునే
బహుపుణ్యా ముంటుందె చెంచీతా
నన్ను పెండ్లాడవే చెంచీతా ॥

చెంచిత.

ఏటుతగిలీమృగము ♦ ఎలమీఁద పోవంగ
ఎదురుకోలాదొడిగి యేసేవా
మాఱుకోలాదొడిగి యేసేవా
మళ్లి తిరిగీ మమ్ము కలిసేవా
మాపటికి మాయింటి కొచ్చేవా
పోవయ్యా పోవయ్యా కృష్ణూఁడా - నీకు -
ప్రొద్దేల పోదోయి నాసామీ ॥

కృష్ణుఁడు

ఏటుతగిలీమృగము ♦ ఎలమీఁదపోవంగ

ఎదురుకోలా దాడిగి యేసేనే
మాఱుకోలాదాడిగి యేసేనే
మళ్లి తిరిగీ నిన్ను కలిసేనే
మాపటికి మీయింటికొచ్చేనే
బహుపుణ్యముంటుంది చెంచీతా ॥
నన్ను పెండ్లాడవే చెంచీతా ॥

చెంచిత.

అడుగుదప్పకుండ ♦ అంగుదప్పకుండ
అచ్యుతావరహా లిచ్చేవా
మాపటికి మాయింటికొచ్చేవా
పోవయ్య పోవయ్య కృష్ణూడా - సీకు -
ప్రొద్దేల పోదోయి నాసామీ ॥

కృష్ణుఁడు

అడుగుతప్పకుండ - అంగుతప్పకుండ
అడిగినా వరహా లిచ్చేనే
చెంచీత మఱి దగ్గరొచ్చేనే
మాపటికి నినుఁగూడి మెచ్చేనే
బహుపుణ్యముంటుంది చెంచీతా
నన్ను పెండ్లాడవే చెంచీతా ॥

చెంచిత

జోరునా వానాల్ ♦ బోరునా గురియంగ
జారూబండ లెక్క నేరూతువా
జరుగూబండ లెక్క నేరూతువా
పోవయ్య పోవయ్య కృష్ణూఁడా - నీకు -
ప్రొద్దేల పోదోయి నాసామీ ॥

కృష్ణుఁడు

జోరునా వానాల్ ♦ బోరునా గురియంగ
జారూబండ లెక్క నేరూతు నే
జరుగూబండ లెక్క నేరూతు నే
బహుపుణ్యముంటుంది చెంచీతా
నన్ను పెండ్లాడవే చెంచీతా ॥

చెంచిత

పోవయ్య పోవయ్య కృష్ణూఁడా - నీకు -
ప్రొద్దేల పోదయ్య నాసామీ
మాయన్నలొచ్చేరు కృష్ణూఁడా
గోరింట పొదలోకి కృష్ణూఁడా
పరుగు పరుగున వెళ్లు కృష్ణూఁడా ॥

కృష్ణుఁడు

గోరింట పొదలోకి చెంచీతా - నాకు -

పోను భయమేస్తుంది చెంచితా
నీవురా పోదాము చెంచీతా
మన మిద్ద ఉందాము చెంచీతా
బహుపుణ్యముంటుందె చెంచీతా
నన్ను పెండ్లాడవే చెంచీతా ॥

చెంచిత

వాదేల ఆడేవు కృష్ణుఁడా
నేను వచ్చేదనయ్యా నాసామీ
నిన్నుఁ గూడెదనయ్యా నాసామీ
మాయన్నలొచ్చేరు కృష్ణుఁడా
నిన్ను కోపించేరు నాసామీ
నిన్నుదండించేరు నాసామీ ॥

కృష్ణుఁడు

వస్తేను బాగాను చెంచీతా - నీవు -
వస్తేను మేలౌను చెంచీతా
బంటు పంతము చెల్లు చెంచీతా
నాభాగ్యమీడేటు చెంచీతా
కలసి మెలసుంటుంది చెంచీతా
బహుపుణ్యముంటుంది చెంచీతా
నన్ను పెండ్లాడవే చెంచీతా ॥

చెంచిత

నీమీఁద మోహంబు కృష్ణూఁడా - నేను -
పట్టలేకున్నాను కృష్ణూఁడా - నేను -
తాళలేకున్నాను నాసామీ
వట్టిమాటలచేత కృష్ణూఁడా - యింత
వాదాయె పోదాము కృష్ణూఁడా ॥

కృష్ణుఁడు

గరుడవాహనమెక్కు చెంచీతా - మనము -
గడియలో పోదాము చెంచీతా
ద్వారకా పురిలోన చెంచీతా
నిన్ను పెండ్లాడుదును చెంచీతా ॥ * * *

ఈరీతి కృష్ణుండు ♦ కోరి చెంచిత మనసు
నీరుఁగా గలఁగించి ♦ నేర్పు మీఱా
ద్వారకా పురిచేరి ♦ కూర్మితోడా ।
దీన జనులను బ్రోచు ♦ దానవాంతకుఁ డొక్క
శుభదినంబున మహా ♦ విభవాముగా
చెంచు చేడియ తన ♦ చెంత రాగా ।
చెంచితను పెండ్లాడి ♦ మించు తన భామలను
వంచించ నాసతిని ♦ గొంచుఁజనె నంతట
వంచనలు మీఱెవరు ♦ ఎంచకుఁడు వింతట ॥

*　*　*　*

సత్యభామా మొదలు ♦ సవతులెల్లరు చెంచు
సతిఁజూచి వెరగంది ♦ సరసాముగా
సఖియలూ కోపించి ♦ విరసాముగా ॥

సవతులు

పులుల దుప్పుల వెంట ♦ పొలములోఁ దిరిగేటి
పొలతుకా మాతోడ సరియాదువే - ఓసి -
చెంచీత మాతోడ సరియాదువే - ఏమె -
చేడెరో మాతోడ సరియాదువే ॥

రుక్మిణి

తలిదండ్రులమాటఁ ♦ దలమీఁటి యన్నాకు
తలవంపులు సేయఁ ♦ దగునాఁటవే ॥

చెంచిత

పనిఁబూని మగసీని ♦ బతిమాలి గతిమాలి
పిలుపించుకోలేదు రుక్మిణీ - అన్న -
తలవంపు సేయవే రుక్మిణీ ॥

సత్యభామ

చెంచీత నీకింత ♦ వంచాన మాటాలు
మించ నాడేవేమె ♦ వేమాఱూ - గ -
ర్వించి పల్కేవేమె పల్మాఱూ ॥

చెంచిత

చంచలాక్షి సారె ♦ జాతాసూకై మగని -
వంచానచేసీన దెఋఁగావఁటే ॥

సవతులు

చాలించు మాటాలు ♦ ప్రేలఁబోకె యింక
ఆలించీ వినియేడీ ♦ దెఋఁగావఁటే ॥
తగులుకోవచ్చీన ♦ దానావు మాత్రోడ
తగునాఁటె పంతాము లాడానానే - యింత -
తెంపూన మాటాలు ఆడాఁదగునే ॥

చెంచిత

వగలాడీ మది కిష్ట ♦ మగు పురుషులు తన్ను
వలచీవచ్చినఁగూడ రాదాఁటవే - పసువు -
తెలియూక పలికేవు వాదాఁటవే ॥

సత్యభామ

రోసామునా ఎన్ని ♦ వేసాము లేసీన
నాసాటి వాదూవె ♦ చెంచుభామా ।

చెంచిత

వేసమంత నీదే సత్యాభామా - శా -
బాసు నిందించాకె మేలుకాదే ।

నవతులు

పెకుప్పాలరవఁబోకె చెంచూభామా।
మాతోఁడా వదరాకే చెంచూభామా॥

*   *   *   *

అనుచూ వాదులాడ ♦ అతివాలందఱిఁ గాంచీ
వనజాక్షుఁడు వాదు వారించీ
చనవూనా సఖ్యాతా నొనరించీ - చెంచీ -
తనుగూడీ నగరు ప్రవేశించీ।
వేమాఱు ఈకధ ♦ ప్రేమతోఁ జదివీన
కామితార్ధాము లెల్లా నిచ్చేనే
కడుభక్తి వినువారిఁ బ్రోచేనే
ఘనమైన సంపాద లిచ్చేనే।
అనుచు సంతసమూన ♦ వనజాక్షుఁడు పల్కి-
వనితామణినిగూడి ♦ హాయలూమించీ
అనిశాము సురతూలఁ దేలించీ
అతులీత సౌఖ్యామూ లనుభవించీ
అధికా సంతోషాముతోఁడామించే॥

శ్రీ శ్రీ శ్రీ

---

చెంచిత కథ సంపూర్ణము.

భక్తి ముక్తి వైరాగ్యముల నుబోధించునట్టియు లోకో
క్తులతోడను నీతిబోధకములగు దృష్టాంతములతోడను
హాస్యభావములతోడను నిండియుండు నట్టియు ఉచిత
ముగ శృంగారరసమును జిందునట్టియు శతకరాజములు
పద్యరత్నములు మున్నగునవి ముద్రింపఁబడియున్నవి.
విషయసూచికవలనఁ దెలుపడఁగలదు. * నక్షత్రపుగుర్తు
గలవి సంపూర్ణముగా ముద్రితములు. తక్కినవానియం
దుండి పద్యరత్నములు కొనఁబడినవి. * 1. వేమనరత్న
ములు - 200 పద్యములు - నీతి. * 2. సుమతి శతకము-
నీతి. * 3. భాస్కర శతకము - నీతి. * 4. సత్యవతీశత
కము - శృంగారము, నీతి. * 5. సురాభాండేశ్వరము -
శృంగారము. * శృంగార రత్నశతకము - [ఇందలి పద్య
ములు - 6. కలువాయి, 7. కాంతాలలామ, 8. లావణ్య
9. తాడిమళ్ల, 10. మల్లికార్జున, 11. చెంగల్వరాయ,
12. చంద్రవదన, 13. నాయక నాయకీ, 14. భర్తృహరి
శృంగారశతకములనుండి.] *15. వేణుగోపాల శతకము-
నీతి, హాస్యము. * 16 కాళహస్తి లింగ-నీతి, హాస్యము.
*17. రామలింగేశ-నీతి, హస్యము. *18. కవిచౌడప్ప-
హాస్యము, నీతి. * 19. గణకాగణ-వేశ్యానింద. *20.
పరకీన్ద్రపక్షాఖ్యానము. హస్యము. *రత్నపంచాశత్తు

—[ఇందలి పద్యములు—21. చిక్కుపల్లె దండ - హాస్యము, నీతి. 22. కామేశ్వరీ - భక్తి, హాస్యము. 23. భుజంగ నృపాలశేఖర - నీతి. 24. భక్తచింతామణీ - భక్తి 25. సర్వమంగళా - భక్తి. 26. శ్రీ కాళహస్తీశ్వర - భక్తి. 27. జానకీపతి - భక్తి - ఈ శతకములనుండి]—* 28. దాశరథి శతకము - భక్తి. *29. నరసింహ - భక్తి. *30. హనుమత్పంచవింశతి - భక్తి. * 31. హనుమద్దండకము - భక్తి. * 32. మానసబోధ శతకము - వైరాగ్యము. * 33. భజగోవిందము-ముక్తిబోధ. * 34. శ్రీ జార్జిచక్రవర్తి శతకము-రాజభక్తి. *35. శ్రీ జార్జిమేరీ జయమంగళము. దాదాపు 2000 రత్నములు గలవు. ఇవి సమస్తజనులకును సుబోధములై జీవితకాలములో అనేక సందర్భములయందుఁ బ్రయోగపడునట్టివి గావున ఈ శతక రత్నావళిని పండితులు పామరులు పట్టణవాస్తవ్యులు పల్లెలవారును గూడ ప్రాణమిత్రముగా భావించి తెప్పించుకొనుచున్నారు.

☞ ప్రతులు కొద్దిగా ముద్రింపబడి యున్నందున వెంటనే తెప్పించుకొననివారికి శతకరత్నావళిదొరుకుట దుర్లభము. ఇది నిశ్చయము.

# కథారత్నావళి

క్రొత్తకూర్పు. శతకరత్నావళివలెనే పెద్దయక్షరములతో చక్కని చిన్నసైజు - 640 పేజీలు-కాలికో బైండు.
వెల . రూ. **1 - 4 - 0.** పో॥ సహా, రూ. **1 - 8 - 0.**

---

ఇండు-అరబ్బీనైట్సుపారసీక ఇంగ్లీషుహిందూ ఇత్యాది అనేక కథాగ్రంథముల యందలి చిత్రవిచిత్ర నీతియుక్తి చమత్కార హాస్యరస ప్రధానములగు 130 చక్కని కథలు మృదుమధురశైలిని రచింపబడియున్నవి. స్త్రీపురుషులు, బాలురు, బాలికలునుచదువుటకు యోగ్యము.

---

## కేసరీవిలాసము.

చిన్నసైజున క్రొత్తకూర్పు - వెల **6** అణాలు.

ముందు **1** రూ. చొ॥ 10,000 ప్రతులు విక్రయమైన అత్యంతమనోహరమైన చిన్ననవల. దీనినిచదువునపుడు సంతోషము, సంతాపము, భయము, కోపము, ఆశ్చర్యము, హాస్యము, శృంగారము-నవరసములు తరంగములవలె పొరలును. చదువనారంభించిన పిదప ముగియువఱకు మఱియొకపని తోచదు! చదివిచూడుండి !!

# వరశుల్క నాటకము.

చిన్నసైజున క్రొత్తకూర్పు - వెల 4 అణాలు.

ఇది మిగుల మనోహరమగు నూతన నాటకము. ఇందు కలిపురుషుని నీతిబోధ, సోషల్ క్లబ్బు మీటింగు, సోమయాజులుగారి తర్కము, దామోదరంపంతుల దర్జా, వాణీబాయి మధురవాక్కులు, మహీపతి మద్రాసు తెనుగు, గురవడు వెంకిజాతీయ సంభాషణలు, ఆంధ్ర స్త్రీల మహాసభ, ఆర్బుతునాటు దివాలాగోల, భజగోవిందస్వాములు, పద్యములు, పాటలు, పదములు-మున్నగునవి శృంగార హాస్య కరుణారసము లొలికించుచుండును!

---

# ఆనంద దీపిక.

చిన్నసైజున క్రొత్తకూర్పు - వెల 8 అణాలు.

ఇందు - విచిత్రములు, గారడీ వినోదములు, చీట్లపేక తమాషాలు, విడుపుకథలు, చిక్కుప్రశ్నలు, జవాబులు, బిడ్డల ముద్దుమాటలు, నవ్వుపుట్టించు 250 సరసములు, పరిహాసములు, చతురోక్తులు, అపహాస్యములు, పిట్టకథలు, 800 తెనుగు సామెతలు, స్త్రీపురుషుల ప్రేమ జాబులు, శృంగారజాబులు, సమాధానజాబులు జాలిజాబులు, వలపు జాబులును గలవు. పరమానందప్రదము!

# స్మరణానందము

కాలికోబైండు. వెల **6** అణాలు. వీ. పీ. ఖర్చు **2** అ.

☞ **4** ప్రతులు తెప్పించుకొంటే వీ. పీ. ఖర్చు లేదు.

—o—

ఇది ముద్దులు మూటగట్టు 93 పేజీల చిన్న పుస్తకము. ఇందు **1.** హరిభజన కీర్తనము - **2.** భజగోవింద శ్లోకములు (౨౬), వానికి సరియైన (౨౬) తెనుగు తోహారాలు - **3.** రామరగడ (౧౦౮ చరణములు) - **4** నారాయణ రగడ (౧౦౮ చ) - **5.** గోవింద రగడ (౧౦౮ చ)- **6.** రామరామ శతకము (౧౦౮ చ) - **7.** నారాయణ శతకము (౧౧౩ చ)-**8.** కృష్ణమంజరి (౧౩౭ చ) - **9.** భారత సావిత్రి - **10.** ముక్తిమార్గము కీర్తనము - ఈపది భాగములు కలవు. పదివేల వరహాలు చేయును. పఠించినవారి వాక్కులును మనస్సులును పవిత్ర మగును. అత్యంతానందప్రదము. పుస్తకము చిన్నదైనను విషయముల గౌరవమునుబట్టి కాలికోబైండు చేయబడినది.

విక్టోరియా డిపో - మైలాపూరు - మద్రాసు.